# వడ్డీవ్యాపారి భార్య

దాస్టావిస్కి




అనువాదం :

ఆలూరి భుజంగరావు





జనసాహితి తెనాలి.

....బుక్ సెల్లర్సు.... & ....పబ్లిషర్సు....

# వడ్డీ వ్యాపారి భార్య

## (చిన్న నవల)




ర చ న :

**డా స్టొ వి స్కీ**

*

అను వా ద ం :

**ఆలూరి భుజంగరావు**



★

జనసాహితి, తెనాలి.

# రచయితను గురించి

డాస్టావిస్కీ విశ్వవిఖ్యాత సోవియట్ రచయిత. వీరు 1821లో మాస్కో నగరంలో ఒక పేద డాక్టరు ఇంట జన్మించారు. ఆనాటి రాచరికపు నిరంకుశత్వం క్రింద అణగారి పోతున్న ప్రజలు; వారిలో పేరుకుపోయిన అవినీతి, అమానుషత్వం వీరిని రచయితగా చేశాయి. వీరి ప్రతి రచనలోనూ దొంగలు, దోపిడీదారులు, త్రాగుబోతులు, ఖూనీకోర్లు మొదలైన అవినీతి పరులే నాయకులై వుంటారు. వీరు జీవితంలో పడరాని పాట్లుపడ్డారు. ఎక్కడికి వెళ్ళినా అవమానం, అన్యాయం వీరిని కృంగదీశాయి. పెండ్లి చేసుకుని ఒక మాసమైనదో లేదో జైల్లో వేయిస్తామని అప్పులవాళ్ళు బెదిరిస్తే, చేసేదిలేక 1867లో రష్యానుంచి పారిపోయి "The idiot" అనే ప్రఖ్యాత నవలను రచించారు. ఈ నవల దాదాపు ప్రపంచంలోని అన్ని భాషలలోనూ అనువదించ బడింది. ఇలాంటి జీవితంతో విసిగి వేసారిపోయిన వీరు ప్రజలలో నమ్మకంపోయి, నిరాశావాదానికి తలవొగ్గడం జరిగింది.

అప్పట్లో వీరి రచనలకు భయపడిన జారుప్రభుత్వం వీరి సాహిత్యాన్ని బైటికి రాకుండా చేసి, వీరికి ఉరిశిక్షను విధించింది. కాని ప్రజలలో వచ్చిన తీవ్ర వ్యతిరేకత ఫలితంగా ఉరిశిక్షమానుకున్నా, కఠినశిక్ష విధించింది. ఐనా ఏమాత్రం వెనుదీయక, అంత్య దశలో కూడా తన పదునైన కలాన్ని నడుపుతూనే 1881 లో పరమపదించారు.



నా బౌద్ధిక జ్ఞానానికి పునాదులను వేసి
నా సాహిత్య జీవితానికి మార్గ దర్శకులైన
ప్రియ సోదరుడు కే. శే. ప్రకాశానికి,
ఆప్తమిత్రుడు కే. శే. శారదకు —

ఆలూరి భుజంగరావు

# 1

నా భార్య చనిపోయింది. ఆమె మృతశరీరం నాముందు పడివున్నది. మృతశరీరి అయినప్పటికికూడా ఆమెలోని వెన్నకటి అందం, సౌకుమార్యం ఏ మాత్రం తగ్గలేదు. నేను పిచ్చివాడిలా తడవతడవకూ ఆమె మృతశరీరం దగ్గరకు వెళ్తున్నాను. ముఖంవంక పరిశీలనగా చూస్తున్నాను. రేపు ఈ నిష్ప్రాణ, నిస్పంద శరీరాన్ని శ్మశానానికి పట్టుకుపోతారు. నేను ఒంటరిగాడినై పోతాను. కాని ఇవ్వాళమాత్రం ఆమె అమాయక సుకుమార శరీరం నాగదిలో ఎప్పటిలాగానే, ప్రాణసమేత అయి వున్నట్టు పడుకోబెట్టివున్నది. రేపుపొద్దు పొడుపుకు యీ సుకుమార శరీరం సమాధిస్థమౌతుంది. సమాధిలోని ఘనజీవసమాజం యీ శరీరాన్ని తనలోకి లీనం చేసుకుని మానవసమాజంనుంచి ఆమెని దూరంచేస్తుంది.... నాభార్య యీ దారుణమైన పరిస్థితికి ఎలావచ్చిందో నేను చెప్పలేకుండా వున్నాను. ఈ దుర్భరస్థితికి ఎలావచ్చిందా ? అనే ప్రశ్నకు నాలోనేనే అనేకసార్లు సమాధానాన్ని వెతుక్కున్నాను. కాని సమాధానం దొరకలేదు. ఆరుగంటలా

చాయల నా భార్య చనిపోయింది. అప్పటినుంచీ ఈ ప్రశ్నకు సమాధానాన్ని పొందాలనే వుద్దేశ్యంతో అంతర్ముఖుడనై వున్నాను. కాని సరైన సమాధానం యేమీ ఇంతవరకూ లభించలేదు. నాభార్యకు సంభవించిన యీ ఘోరమృత్యువుకు సంబంధించిన కారణాలను తెల్సుకోవాలసి నేనుయెంత ప్రయత్నిస్తున్నానో, అవి అంతేచిక్కగా, అస్పష్టమూ అయి పోతున్నై. బహుశా నా భార్యకు సంబంధించిన ప్రతి సంఘటననూ ఒక క్రమంలో పెట్టి లిపిబద్ధంచేస్తే సమాధానాన్ని పొందవచ్చునేమో !

మొదటిసారిగా ఆమె నాదగ్గిరకు తనవస్తువుల్ని కొన్నింటిని తాకట్టు పెట్టడానికి వచ్చింది. అప్పుడు ఆమెమీద నేను ఏవిధమైన ప్రత్యేకతనూ చూపలేదు. తనకు, గౌరవనీయమైన కుటుంబంలో ఎక్కడైనా పనిమనిషి ఉద్యోగం కావాలన్న ప్రకటనను 'గోలాస్' అన్న ఒక దినపత్రికలో ప్రకటింపదలచింది. ప్రకటనకు డబ్బులేదు. అందువల్లే తనకువున్న కొద్దిపాటి వస్తువుల్ని తాకట్టు పెట్టడానికి నాదగ్గిరకు వచ్చింది. నేను వస్తువుల్ని కుదువబెట్టుకుని వడ్డీకి డబ్బు అప్పు యిస్తానని ఆమెకు తెల్పాను.

మొదటిరోజున ఆమెలో నాకు ఏవిధమైన ప్రత్యేకతా కనుపించలేదు. అందరు అప్పుతీసుకునేవాళ్ళలాగానే వందలో ఒకటిగా చేర్చిచూశాను. కాని, తిరిగి ఒకటి, రెండుసార్లు అప్పుతీసుకోవడానికి నాదగ్గిరకు వచ్చింది. అప్పుడు కొంచెం

పరిశీలనగా చూశాను. ఆరోజుల్లో ఆమె కొంచెము పొడుగ్గా,సన్నగా కనుపించేది. ఉంగరాలజుట్టు; సౌకుమార్యం శరీరం అంతటినుండీ చిందుతూవుండేది. అప్పట్లో నన్నుచూసి తడవతడవకూ సిగ్గుతో ముఖాన్ని ఎర్రబార్చుకునేది. ఈసిగ్గిలే స్వభావం ఆమెలో సహజంగానే వున్నదని నావిశ్వాసం! నాదగ్గిరేకాదు ఏ అపరిచిత వ్యక్తిదగ్గిరైనా ఆమెముఖం ఇట్టే ఎర్రబడిపోతుంది. నేను ఆమె తెచ్చినవస్తువుల్ని చూసి విలువను బట్టి వాటికి ఖరీదు కడుతుండేవాడిని. ఆమె మొదలకండా తల వంచుకుని వెళ్ళిపోయేది. ఒక్క—మాట మాట్లాడేదికాదు. ఖరీదును గురించిగానీ, విలువనుగురించిగానీ, కొసరేదికూడా కాదు.

ఆమె తాకట్టుకు తెచ్చే వస్తువులు చాలా చిత్రంగా వుండేవి. ఒకమాటు ఒక గిలిట్ చెవిపోగు నొకదాన్నీ, నికల్ మెడల్ నొకదాన్నీ పట్టుకువచ్చింది. ఆ రెండింటి విలువా కలిపినా ఆరు అణాలకు మించదనీ, అవి అతి సాధారణవస్తువులనీ, ఆమెకు తెలుసును. కాని ఆమె ముఖ కవళికలనూ, భావాలనూ బట్టి, అవి ఎంత సాధారణమైనవి అయినప్పటికీ వాటిమీద ఆమెకు గాఢమైన మమత వున్నదని తెలుసుకోవడానికి ఆటే సేపుపట్టలేదు. ఏదో పెద్ద ఆపత్తూ, ఇబ్బందీ సంభవించక పోయినట్టయితే, ఆమె ఆవస్తువుల్ని ఎన్నటికీ తాకట్టు పెట్టేదికాదు. ఆమెకి తల్లీ దండ్రీనుండి, వారు గతించిన అనంతరం ఉత్తరాధికారంలో లభించినవి ఈరెండు వస్తువులు మాత్రమేనని తరువాత తెలిసిందినాకు.

నేను వ్యాపారిని. కనుక నాదగ్గిరకువచ్చే బేరగాళ్ళతో అత్యంతనమ్రంగా వ్యవహరించడం నాప్రధానమైన కర్తవ్యంగా భావిస్తూవుంటాను. వ్యాపారసంబంధమైన విషయాల్లో ఆమె తోకూడా నేను చాలా నమ్రంగా వ్యవహరించేవాడిని. కాని ఒక్క-సారిమాత్రం-కేవలమూ, ఒక్క సారిమాత్రం హేళనగా వ్యంగ్యంగా మాట్లాడాను ఆమెతో. నాహేళనకు ఆమె ముఖంలో వెంటనే భావోత్తేజిత పొడకట్టింది. అందంగానీలిరం గుతో భావమగ్నమైయుండే ఆమెకండ్లు క్షణకాలంలో అగ్నిమయమైనయ్యి. కాని ఆమె నోరెత్తి ఒకమాట మాట్లాడ లేదు. మొదలకుండా తనుతాకట్టకని తెచ్చిన కుందేటి చర్మపు దుప్పటిని మడతపెట్టి చంకనపెట్టుకుని వెళ్ళిపోయింది. ఆరోజున ఆమెముఖంలో కనుపించిన భావోద్రేకతకూ,వుత్తేజితకూ ప్రథమంగా నాదృష్టి ఆమెవైపుకు మరలింది. అంతేకాదు అప్పటి ఆమె వుద్రిక్తముఖభావన, ఇప్పటికీ నాస్మృతిపథంలో చెరక్కుండా వుజ్వలంగా వున్నది. అప్పటి ఆమె ఆకారాన్ని బట్టి చాలా చిన్నవయస్సనీ, పద్ధానుగుపళ్ళకు మించివుండవనీ అనుకున్నాను. కాని అప్పటికే ఆమెకి పదిహేనువళ్ళు వచ్చినయ్యి.

•

మరుసటిరోజున అదే దుప్పటిని మళ్ళీ నాదగ్గిరకు తెచ్చింది. నాదగ్గిరకు తెచ్చేముందు ఆ దుప్పటిని మరిఒక రిద్దరు షరాబుల దగ్గిరకు పట్టుకు పోయింది. కాని వాళ్ళు వెండి బంగారపు వ్యాపారస్తులు కావడంవల్ల యీ చినిగిన

దుప్పటిని తాకట్టుపెట్టుకోవడానికి అంగీకరించలేదు. వేరు విధి కానక దాన్ని తిరిగి నాదగ్గరకే పట్టుకువచ్చింది.

మరొకసారి ఆమె కంకరరాళ్ళలాంటి కొన్ని వస్తువుల్ని పట్టుకు వచ్చింది. ఆమెను నిరాశపరచకూడదనే దృష్టితో వాటిని స్వీకరించి కొంతడబ్బు యిచ్చాను. ఈసారికూడా ఆమె నాదృష్టిని ఆకర్షించింది.

ఇంకొకసారి ఆమె నాదగ్గరకు అభ్రక సిగిరెట్ కేసు నొకదాన్ని పట్టుకు వచ్చింది. యదార్థానికి ఆ సిగిరెట్ కేసు మంచి విలువకలదే. కాని నేను వెండి బంగారపు వ్యాపారస్తుడిని కావటంవల్ల నాకు అది అంతగా వుపయోగించదు. ఐనా రెండు రూపాయలను ఆమెచేతిలోపెట్టి "ఇవిగో! వీటిని తీసుకో. కేవలం నీముఖంచూసి దీనికీ డబ్బును ఇస్తున్నాను. నాకు యిది బొత్తిగా నిరుపయోగం!" అన్నాను. ఈ మాట వినగానే ఆమె ముఖం క్రోధంతోటీ, సిగ్గుతోటీ ఎర్రబడిపోయింది. అభిమానంతో నాడబ్బును నాకు తిరిగి యిస్తుంది అనుకున్నాను. కాని ఆమె అలా చేయలేదు. 'డబ్బులేమి' మనిషిని ఎంత అస్వతంత్రంలో పడేస్తుంది! నామాటలవల్ల ఆమె మనస్సుకు బాగా కష్టంకలిగింది అనుకున్నాను. ఆమె వెళ్ళాకఒకఆలోచన నాలోతెర్లింది. "ఆమెలోని వివశత్వాన్నీ బలహీనతనూ ఆధారంగా తీసుకుని, ఆమెను అవమానించి అవమానిత అయిన ఆమెమీదపొందినవిజయం రెండురూపాయల విలువ చేయదా?" అనుకున్నాను. వెంటనే నామనస్సు

సమాధానంగా ప్రతిధ్వనించింది. "అవును, నీవిజయంముందు ఈ రెండురూపాయలూ అల్పం! ఆమెలోని సహజమైన గర్వం, స్వాభిమానం పటాపంచలై పోతూండగా చూసి నీకు కలిగిన ప్రసన్నతముందు, ఈ రెండురూపాయలు అత్యల్పం!!" నాలో నేనే ఒకక్షణం నవ్వుకున్నాను. ప్రత్యేకం కావాలని నేను ఆమెనలా అవమానించాను. అలా అవమానించడంలో నా దొక ఆదర్శంకూడా వున్నది.

అలా తలవంచుకుని వెళ్ళిపోయిన ఆమె తిరిగీ నాదగ్గిరకు తప్పకుండా వస్తుందనే విశ్వాసం ఏదో నాలో గట్టిగా పనిచేయసాగింది. అతి ఆత్రంతో ఆమెరాకకోసం ఎదురు చూడసాగాను. నేను ఆశించినట్లే అయింది. ఆమె వచ్చింది. ఈసారి నేను చాలా మిత్రభావంతోటీ, ఆత్మీయతతోటీ ఆమెతో మాట్లాడాను. నేను మొదట్లోనే ఆమె శీల స్వభావాలు వృత్తిమనం గలవు చెందినవనీ, ఎవరేగాని తనతో మర్యాదగా, సభ్యంగావ్యవహరించాలని కోరుతూవుంటుందనీ గ్రహించాను. ఈసారి నేను ఆమెకోరిన విధంగా వ్యవహరించటం వల్ల, కృతజ్ఞతకు సంబంధించిన మృదువైన భావాలు ఆమె ముఖంలో కనపించాయి. నేనొక ముగ్ధ సుకుమార హృదయపు కృతజ్ఞతను పొందగలిగాను ఈఆలోచన నన్ను హర్షోన్మత్తుని చేసింది. ఆరోజుకూడా ఆమె ఏమీ మాట్లాడలేదు

"గోలాస్" పత్రికలోని ప్రకటనకు సంబంధించిన వివరాలు తరువాత తెలిసినవినాకు. బ్రతకటానికి వేరుమార్గాన్ని

కానక పత్రికలో ప్రకటన ఇవ్వదలచింది. పత్రికలో ప్రకటింప దలచిన విషయం ఇది: "గౌరవనీయమైన కుటుంబానికి సంబంధించిన స్త్రీ, సభ్యకుటుంబంలో పనిమనిషిగా విదేశ యాత్రలకు వచ్చుటకు సిద్ధముగానున్నది!"

కొన్నాళ్ళ తరువాత అదే పత్రికలో పై ప్రకటననే కొద్ది మార్పులతో యీ విధంగా ప్రకటింప బడ్డది. "వయస్సులో వుండి శక్తి కలిగిన స్త్రీ, క్రిందిపనుల్లో దేన్నైగాని చేయటానికి సిద్ధముగా నున్నది:- పిల్లలకు చదువు చెప్పడం— ఏ స్త్రీకయినా సహచరిగా వుండడం—ఎవరయినా రోగికి పరిచర్యలు చేయడానికి, లేక ఏ కుటుంబంలోనైనా పాతగుడ్డలు కుట్టడానికి—సిద్ధముగానున్నది!" ఈప్రకటనకుకూడా ఎటునుంచీ పిలుపు రాకపోయేసరికి పై ప్రకటనలోనే మరికొన్ని మార్పులను చేసింది. అయినా ప్రయోజనం లేకపోయింది. చివరకు నిరాశపడి తన ప్రకటనకు చివర్న ఈ రెండుముక్కల్నీ కూడా జతపరిచింది. "జీతం అవసరంలేదు. కేవలం భోజన నివాసాలకు ఏర్పాట్లు చేస్తేచాలు!" ఇలా ప్రకటించినా ప్రయోజనం లేకపోయింది.

తరువాత ఒక రోజున ఉదాసీన భావాన్ని ముఖంలో కనబరుస్తూ అతిదీనవదన అయి ఆమె నాదగ్గిరకు వచ్చింది. అదే రోజున "గోలాస్" పత్రికలో మరెవరో ప్రకటించిన ప్రకటనను ఆమెకు చూపించాను. ప్రకటన యిలా వుంది. "ఒక అనాథ ఐన ప్రౌఢస్త్రీ—పిల్లలకు చదువు చెప్పనూ పని

పాటలు చేయనూ సిద్ధముగానున్నది. ఎవరయినా భార్యా చనిపోయిన పురుషునకు సేవచేయు భాగ్యంలభిస్తే మరీ మంచిది. ఇంటి పనులను చక్కగా సరిదిద్దగలదు!"

పై ప్రకటనను చూపుతూ ఇలా అన్నాను. "చూశావా? యీమె ఎవరోగాని ప్రకటన ఇవ్వడం బాగా తెలుసు ఇవ్వాళపుదయం యీ ప్రకటన వెలువడింది. బహుశ సాయంకాలానికే యీమెకు పనిదొరకవచ్చు!"

నామాటల్లోని అంతరార్థాన్ని ఆమె తెల్సుకున్నది. కోపంతో ఆమె ముఖం ఎరుపెక్కింది. కళ్లు చెమర్చినయ్యి. ఆమె ముఖాన్ని ప్రక్కకు తిప్పుకుని నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది. కాని అనుభవంకల నాకండ్లు ఆమె ఆర్థిక,మానసికపరిస్థితుల్ని బలహీనతల్ని ఇట్టే కనిపెట్టినయి. ఆమె దారిద్ర్యంలో పరాకాష్ఠనందుకున్నది. తాకట్టు పెట్టటానికికూడా యేమీలేవు ఆమెదగ్గర. కనుక నేను అన్నమాటకు ప్రస్తుతానికి కోపమే రావచ్చు.కాని పరిస్థితుల్నిబట్టి ఐనా ఆ మాటల్లోని అంతరార్థాన్ని గురించి ఆలోచించక తప్పదు; ఒప్పుకోకా తప్పదు.

నావూహ యదార్థమైంది. మూడు రోజుల తరువాత ఆమెమళ్ళీ నాదగ్గిరకు వచ్చింది. ముఖం పాలిపోయి వున్నది. చూపులు భయం భయంగా వున్నయ్. ఆమెను చూస్తూనే ఇంట్లో ఏదో గలభా జరిగివుంటుందనీ, ఆమెపూర్తి నిరాశ్రయి అయి వుంటుందనుకున్నాను. ఆమె వస్తూ ఒక దేవతా విగ్ర

హాన్ని తాకట్టుకు తెచ్చింది. ఆ విగ్రహం చాలా పురాతన మైనది. కొన్ని తరాలుగా వారి యింట్లో ఆ విగ్రహం వుంటూ వుండవచ్చును. అది ఆమె తాతలూ, తండ్రులూ పూజించినదై వుంటుంది. అలాంటి పవిత్రమైన విగ్రహాన్ని తాకట్టుకు తెస్తుందని కలలోకూడా అనుకోలేదు నేను. దుర్భరమైన దారిద్ర్యంలో ఏం చేస్తుంది పాపం! ఆ దేవతా విగ్రహంమీద జరీవి, పట్టువి వస్త్రాదులు వున్నై. నేను ఆమెమీద దయను చూపుతున్నట్టు స్వరాన్ని పెట్టి "ఇప్పటికి విగ్రహంమీది వస్త్రాలను తాకట్టు పెట్టు. దీనితో కొన్నాళ్ళపాటు నీ పనీ గడిచిపోతుంది, విగ్రహం నీదగ్గిరే వున్నట్టూ అవుతుంది!" అన్నాను.

"ఐతే, యీ విగ్రహాన్ని తీసుకోవడానికి అభ్యంతరం యేమైనా వున్నదా మీకు?"

"లేదు, నాకేమీ అభ్యంతరం లేదు. దేవతా విగ్రహంకదా, యెందుకు తాకట్టు పెట్టడం అని చెబుతున్నాను!"

"పరవాలేదు లెండి—విగ్రహాన్నీ దాని బట్టల్నీకూడా తీసుకోనండి!"

"పోనీ మరొకపని చెయ్యి. ఆ విగ్రహాన్ని పూర్తిగా నాకు యిచ్చేశెయ్యి. తాకట్టు వస్తువులా కాకుండా, ఇతర దేవతా విగ్రహాల్తోపాటు దీన్ని పూజిస్తూంటాను, అఖండ జ్యోతిని దీనిముందు వెలిగించి పెడతాను. మత విషయకమయిన విషయాల్లో నేను ఏమాత్రం అశ్రద్ధ చూపను.

పూర్తిగా ఆస్తికుడిని కూడాను! కనుక ఈ విగ్రహాన్ని శాశ్వతంగా నాదగ్గిరవుంచేశ్తెయ్యి. అందుకుగాను పదిరూపాయలు ఇస్తాను!"

"నాకు పదిరూపాయలు అవసరంలేదు. ఐదేచాలు. ఈసారి దీన్ని తప్పని సరిగా విడిపించుకుంటాను."

"పరవాలేదు. పదిరూపాయలు తీసుకోవచ్చు. ఈవిగ్రహం అంతఖరీదు చేస్తుంది."

ఆమె కండ్లు ఒకమాటు తీవ్రంగా మెరిసినయ్యి. నేను "దయ" అనే పెద్ద బరువును తనమీద వేయబోతున్నానని స్పష్టంగా తెల్సుకున్నది. కాని, నోరు మెదల్చలేదు. నేనూ ఏమీ మాట్లాడకండా ఐదు రూపాయలను తీసి ఆమెచేతిలో పెడుతూ "నేను ఇతర్లను, బాధల్లో, కష్టాల్లోచూసి ద్వేషిస్తానని కల్లో కూడా అనుకోకు. నేను స్వయంగా చాలా రోజులు దరిద్రాన్ని అనుభవించాను. వస్తువులను తాకట్టు పెట్టుకొనే ఈవ్యాపారాన్ని స్వీకరించాను...అందువల్ల...!"

"ఐతే బాధలుపడి...ప్రతి క్రియగా సమాజంమీద పగదీర్చుకోవడానికి... ఈవృత్తిని స్వీకరించారన్నమాట! ఔనా!" అంటూ ఆమెనవ్వింది. ఆ నవ్వులో వ్యంగ్యంవున్నా ముఖం మాత్రం నిష్కల్మషాన్ని, జోతకం చేస్తున్నది.

నేను మనస్సులోనేఅనుకున్నాను "ఐతే నీ అసలురూపం. ఇదన్నమాట! నీమానసిక వికాసం ఏదిశగా జరుగుతున్నదో ఇప్పుడు బోధపడ్డది." పైకి ఇలాఅన్నాను. "నీవన్నది

నిజమేకావచ్చు! కాని, కొంతమంది తప్పులు చేసినా వాళ్ళ ఆదర్శంమాత్రం వున్నతమైనదై వుంటుంది; నేనూ అలాంటి వాళ్ళల్లో ఒకడిని !"

ఆమె వెంటనే అందుకున్నది. "ఆగండి! ఈమాటల్ని ఏదో పుస్తకంలో చదివినట్టు జ్ఞాపకం! దానిపేరు... ;"

'నేనీమాటల్ని 'గోథ' నాటకంలోనుంచి స్వీకరించాను. సైతాను క్రీస్తుకు తన గుణ గణాలను వివరించి చెబుతూ పైమాటను అంటుంది. సైతాను క్రీస్తుతో అన్నమాట నీదగ్గర వుపయోగించి నీచమైన నావృత్తియొక్క నీచత్వాన్ని కప్పి పుచ్చుకో చూస్తున్నానని మాత్రంఅనుకోకు. నావృత్తికి మూలాధారం "ప్రజల్ని పీడించడం" అనే విషయాన్ని నేనేమాత్రము దాచను!"

"మీరు చాలాచిత్రమైన మనుషులే! మీరు ఇలాంటి వారై వుంటారని నేను కలలోకూడా అనుకోలేదు !"

అసలు ఆమె అభిప్రాయం "నీవు చదువుకున్న వాడివని నేను కలలోకూడా అనుకోలేదు!" అందామని.

నా సాహిత్య సంబంధమైన జ్ఞానానికి ఆమె పూర్తిగా సంతోషించింది. నేను అన్నాను "ఏవ్యక్తిగానీ, ఎంత నీచమైన వృత్తిలోనైనా వుండనీ, కోరినట్లయితే దానిలోనే కొంతమంచినికూడా సృష్టించగలడు."

విద్యుత్ స్పర్శలాంటి దృష్టితో ఆమె ఒకమాటు నాముఖంలోకి చూసి "మీరు సత్యంచెబుతున్నారు. ఒకమ

నిషి. మంచిగా వ్యవహరించ దలచుకున్నాడంటే, ఎలాంటి పరిస్థితిలోనూ మంచిగా వ్యవహరించ గలుగుతాడు!" అన్నది. ఆమె మాట్లాడిన ఒక్కమాటా దృఢంగావుండి, ఆత్మవిశ్వాసాన్ని ధ్వనింప చేస్తున్నది. అందువల్లే ఆమెమాటలు నాలో ఆశ్చర్య జనకంగా పనిచేసినై.

ఆరోజు ఆమె వెళ్ళినతరువాత ఆమె ప్రతిచిన్నమాటా బ్రహ్మాండమైన ఆకారాన్ని దాల్చి నాహృదయంచుట్టూ పరిభ్రమించసాగినై. ఆమెమీద నామనస్సులో గూడుకట్టుకుంటున్న రహస్య, అస్పష్ట భావాలు పూర్ణమైన ఒకరూపానికి వచ్చినై ఆరోజున. నేను ఆమెజీవితానికి సంబంధించిన ప్రతిచిన్న విషయాన్నీ గురించి వివరంగా తెల్సుకోసాగేను. ఆమెవుండే ఇంట్లోనే ల్యూకేరియా అనే ఒక పనిమనిషి వున్నది. ఆపనిమనిషిద్వారా ఆమె సహజమైన ఓర్పునీ, ధీరత్వాన్నీ తెల్సుకున్నాను. ఈ చిన్న వయస్సులోనే ఎన్నో బాధలను, అతి సహనంతో ఓర్పుతో ఎదుర్కొన్నదిట. ఈసహన, ధీరత్వాలకు మూలాధారం యవ్వన బలిమి అనుకున్నాను. యవ్వనోత్సాహంతో హృదయ కంపితమైన అనేక బాధలను సహించినందుకు ఎంతో సంతోషించాను. ఆరోజునుంచీ నామాటల్తో ఆమె హృదయంలో ఒక గొప్ప ప్రభావాన్ని వేశాను. అలా వేయగలిగినందుకు ఎంతో ఆనందించాను. నా ప్రభావంనుంచి వారెన్నటికీ ఆమె ముక్తంకాలేదు!

# 2

నేను ఆమెను గురించి రహస్యంగా చాలా విషయాలను తెలుసుకున్నాను. ఆమె తల్లిదండ్రులు చనిపోయి మూడు సంవత్సరాలు దాటింది. ఈ మూడేళ్ళ నుంచి ఆమె తన ఇద్దరు మేనత్తల దగ్గిరా వుంటున్నది. ఆ మేనత్తలే ఆమె సంరక్షణభారాన్ని భరిస్తూ వున్నారు. మేనత్తల ఆర్థిక స్థితి ఏమంత చెప్పదగినది గాదు. సమాజంలో గౌరవనీయమైన స్థానమైనా లేదు వారికి. వారి ఆర్థికస్థితితో గానీ, గౌరవ మర్యాదలతో గానీ పోల్చుకుచూస్తే నేనుఎంతో గొప్పవాడిని వారికంటే. నేను కొన్నాళ్ళు మిలటరీలో స్టాఫ్ కెప్టెన్ పదవిలో నున్నాను. నేను పుట్టింది ఒక గౌరవనీయమైన సుప్రఖ్యాతమైన వంశం! అంతే కాకుండా ప్రస్తుతపు నా ఆర్థికస్థితి వారిస్థితికంటే కొన్నివందలరెట్లు మెరుగ్గా వున్నది. కనుక ఆమె మేనత్తలు, నేను ఎంత వడ్డీవ్యాపారిని అయినా, అవజ్ఞగా, అమర్యాదగా చూడలేరు నన్ను.

ఇద్దరు మేనత్తలదగ్గిరా ఆ అనాథ రోజుల్ని చాలా కష్టంగా దొర్లిస్తున్నది. రాత్రింబవళ్ళు అత్తలకు ఎముకలు విరిగేట్లు చాకిరీ చేస్తూకూడా ఎలాగో తీరిక సమయాల్లో చదివి; ఎంట్రెన్సు పాసైంది. దీన్నిబట్టిచూస్తే ఎలాంటి హీన పరిస్థితిలోనూ ఆమెలోని అభ్యుదయకర భావాలు చావవనీ,

పుత్కర్షను ప్రాప్తింప చేసుకోవాలనే కోర్కె ఆమెలో బలీయంగా వున్నదనీ తెల్లమౌతున్నది. ఇన్ని సద్గుణాలు వుండడం వల్లనో ఏమో ఆమెను పెండ్లాడాలనే బలీయమైన వాంఛ నాలో రేగింది. ఇంకొక మధ్యవయస్కుడెవడైనా ఇలాంటి నవవికసిత పుష్పంతో సంబంధం పెట్టుకో చూసినట్లయితే, తప్పకండా ముఖాన వుమ్మేసేవాడిని. కాని, నేను స్వయంగా ఇంత పతనానికి ఎలాపోయాను? ఇందులో తప్పు నా ఒక్కడిదేనా? అపూర్వాకర్షణా యుక్తమైన ఆమెది కూడానా?

ఆమె అస్తమానమూ అత్తలకు సమస్త చాకిరీ చేసిపెట్టేది. అత్తల కొడుకులకూ కూతుళ్ళకూ చదువులు చెప్పేది. బట్టలు వుతికేది. అన్నాలు పెట్టేది. ఏనాడైనా, ఏపనిలోనైనా స్వల్పమైన పొరపాటు జరిగిందంటే చచ్చేట్టు కొట్టేవాళ్ళు ఆమెను. ఇంత చాకిరీ చేసిపెడుతున్నా, ఆమె అత్తలు దయారహితహృదయులై ఆమెను ఎవరికన్నా అమ్మి డబ్బుచేసుకోవాలనే ఆతృతలో వున్నారు. వాళ్ళు వుంటున్న ఇంటి రెండవ భాగంలో చిల్లర దుకాణదారుడు ఒకడు వున్నాడు. అతడు కొంచెం స్థూలకాయుడు. ఇద్దరు భార్యలను శ్మశానాలకు పంపించాడు మూడవ భార్యకోసరం వెదుకుతున్నాడు. ఆమెను నిత్యం చూస్తూవుండడం, నిత్యం అత్తలుకొట్టి హింసించడం తెలిసి వుండడంవల్ల ఎలాగయినా ఆమెను వివాహం చేసుకో చూస్తున్నాడు. ఆమెమీద తన క్రూరమైన కండ్లను వేశాడు. ఒక పెద్దమొత్తంతో అత్తల్ని సంతోషపెట్టి తన

అసహజమైన వాంఛను నెరవేర్చుకోదలచాడు. అత్తలు ఆమెను తనకు ఇస్తారనే అతని విశ్వాసం!

ఈ వుద్దేశ్యంలో అభిభూతుడై ఆ యాభైఏండ్ల వృద్ధుడూ ఆమె దగ్గిర అనేక రకాలుగా తన ప్రేమను ప్రదర్శించ సాగాడు. ఈవిషయం తెలిసి ఆమె కంపించి పోయింది. వీడి ఇనుప పిడికిలిలోనుంచి ఎలాగా తప్పించుకోవడం అని ఆలో చించ సాగింది. చివరకు "గోలాన్" పత్రికలో ప్రకటనను ఇచ్చి ఎక్కడయినా పని సంపాయించుకో దలిచింది. ప్రకట నార్థం కావలసిన డబ్బుల నిమిత్తమే నాదగ్గిర వస్తువులను తాకట్టు పెట్టింది. ఈ సందర్భంలోనే నాకూ ఆమెకూ పరిచ యం ఏర్పడ్డది. ఆమె అత్తల దగ్గిర, ముసలి వాడిని వివాహం చేసుకునే విషయంలో కొంత సమయాన్ని గడువుగా అడిగి తీసుకున్నది. అత్తలు గడువను ఇస్తూ త్వరలో తన అభిప్రా యాన్ని తెలియచేయాలనీ,ఎక్కువ రోజులు ఇక వారు ఆమె నుభరించలేమనీ చెప్పారు. పై విషయాలన్నింటినీ నేను రహా స్యంగా తెల్సుకున్నాను. ఎలాగయినా ఆమె అత్తల్ని పరిచ యం చేసుకోవాలని నిశ్చయించు కున్నాను.

సాయంత్రం నేను ఆమెదగ్గిరకు పోయేసరికి ఆ ముసలి వాడు అర్ధరూపాయి మిఠాయీలను తీసుకొని తన ప్రేమను ప్రదర్శించడానికి వచ్చాడు ఆమె దగ్గిరకు. నేను వంటగదిలోకి పోయి సౌజ్ఞతో పనిమనిషిని ఇవతలకు పిలిచి ఆమెను అవు

సరసమైన పనిమీద ఒకమాటు, నేను పిలుస్తున్నట్లు చెప్ప మన్నాను.

నేను వాకిట్లో నిలబడ్డాను. వంటమనిషీ, ఆమె ఇద్దరు కలిసి నాదగ్గిరకు వచ్చారు. నేనిలా అన్నాను ఆమెతో "నేనిలా అగస్మాత్తుగా వచ్చినందుకు, గాభరా పడడంగానీ, ఆశ్చర్యపడడంగానీ చేయ నవసరంలేదు. నీ గౌరవ మర్యాదలకు ఏవిధమైనటువంటి హానీ కలుగనీయను. నీజీవితానికి సంబంధించిన ప్రతి చిన్నవిషయమూ నాకు తెల్సు. అంతా తెల్సుకున్న తరువాతనే నిన్ను నాతో వివాహ మాడమని అర్థించటానికి వచ్చాను. నేనిలా వికృతంగా మాట్లాడుతున్నందుకు ఏమాత్రమూ భయపడ నవసరములేదు. మొదలు నేను చెప్పబోయే ప్రతి విషయాన్ని జాగ్రత్తగా విను. నేనొక అతి నీచమైన ప్రవృత్తిగల అహంకార వాదిని. అంతేకాదు, నేను చేసే వృత్తికూడా నీచమైనదే! అలాంటి నాతో జీవితాన్ని గడపడంవల్ల నీకు విశేషంగా సుఖమేమీ లభించదనే విషయం నిర్వివాదం! కాని, మరొక విషయంకూడా నీకు చెప్పాలి, నాలోని నీచత్వంతోటీ, పశుత్వంతోటీ నిరంతరం ఘోరంగా సంఘర్షిస్తూనే వున్నాను. వాస్తవానికి నేను నా వెనకటి వున్నతమైన ఆదర్శంనుంచి పతన మైనాను. కానీ, ఈనీచమైన వడ్డీ వ్యాపారంలోకూడా నాకొక ఘనమైన వుద్దేశ్యం వున్నది ఆఘనమైన వుద్దేశ్యం ఏమిటో, దానిని నేను ఎందుకు స్వీకరించానో మొదలయిన విషయములను గురించి ఇప్పుడేమీ తెలియచేయను. అంతే కాకుండా నా ఘనమైన వుద్దేశ్యం

పూర్తిగా నెరవేరే వరకూ నీవుగానీ, నేనుగానీ ఏవిధమైన విలాస జీవితాన్ని గడపడానికి వీలులేదు. సినిమాలకు వెళ్ళడం జరగదు. తళుకు బెళుకు వస్త్రాదుల్ని కొనడం అంతకన్నా జరగదు. ఇలా మొదట్లోనే చెప్పడం వుచితం అనుకుని చెబుతున్నాను. ఇక నీవు ఆలోచించుకుని నన్ను పెండ్లిచేసుకోవడం ఇష్టమో కాదో చెప్పు!"

ఈమాటలు చెబుతున్నంతసేపు నేను ఆమె ముఖంలోకి పరిశీలనగా చూస్తూనే వున్నాను. ఆమె ముఖంలోని ప్రతి చిన్న భావ పరివర్తననూ గమనిస్తూనే వున్నాను. ఎక్కువగా భయపడ్డది. ఆయాస పడుతున్నది. గంభీరంగా ఆలోచించడం వల్లనో ఏమో కను బొమలు ముడి పడినై. ఆమె ఇంతకు క్రితం ఎన్నడూ ఇంత తీవ్రమైన మానసిక సంఘర్షణలో పడనట్టుగా వున్నది. ఆమె ఆలోచనా తరంగాలను గురించి నేను యిలా అనుకున్నాను. "ఐతే ఈమె ఆ ముసలి వ్యాపారికీ నాకూ మనస్సులో తారతమ్యతను చూసుకుంటున్నదా ? ఎవరు నయమా ? అని ఆలోచిస్తున్నదేమో ? ఈమె ఒకవేళ నిజంగానే ఆ ముసలి వాడికీ నాకూ పోటీపెట్టి తారతమ్యతను ఆలోచిస్తున్నదంటే అది నాకు ఖచ్చితమైన అవమానమే ! ఛా...ఛా... ఆమె ఎన్నటికీ అలా చేయదు. ఆ ముసలి పీనుగతో పోల్చి నన్ను ఎన్నటికీ చూడదు. యదార్థం ఆలోచిస్తే ముసలి వాడిని ఆమె ద్వేషించి నట్టుగా నేను కూడా ద్వేషించ లేనేమో !"

చివరకు అన్నది "నేను కొద్ది రోజుల తరువాత మీ ప్రశ్నకు సమాధానాన్ని ఇస్తాను. నాకు ఆలోచించడానికి వ్యవధి నివ్వండి. !"

నేను వెనక్కి తిరిగాను. కొద్ది దూరం వెళ్ళానో లేదో పనిమనిషి నా వెనక పరుగెత్తుకు వస్తున్నట్టయింది. నేను ఆగి పోయాను. నా దగ్గిరకు వచ్చి పనిమనిషి అత్యంతమైన వుత్సాహంగా యిలా అన్నది. "భగవంతుడు మీకు సదా మేలు చేస్తాడుబాబూ ! మీరా అమ్మాయిని రక్షించారు ! మీరే రాకపోయి నట్లయితే పాపమా అమ్మాయిని ఆ ముసలి రాక్షసునికిచ్చి పెండ్లి చేసేవారే ! మిమ్మలను వివాహం ఆడడం తనకు ఇష్టమని చెప్ప మన్నది నన్ను. కానీ, ఆ ముసలి వాడినుండి మీరు రక్షించి నట్టు ఎన్నడూ మీ రామెతో అనకండి, ఆ వుద్దేశ్యము వచ్చేట్టు ప్రవర్తించను కూడావద్దు. ఎందువల్ల నంటే, ఆ అమ్మాయి చాలా స్వాభిమానం కలది. ఇలాంటి మాటలను వింటే మనస్సులో బాధ పడుతుంది !"

ఆమె చాలా స్వాభిమానం కలది ! ఆమెలో వున్న ఈ ప్రత్యేకత నాకు బాగా అనుభవమే ! ఈ స్వాభిమానం వల్లనే ఆమెను నేనింత గాఢంగా కోరు తున్నాను. నాకు స్వాభిమానంకల పిల్లలంటే చాలా యిష్టం ! బహుశ ఆమె తన మనస్సులోనే ఇలా ఆలోచించు కొని వుంటుంది. " నేనీ యిద్దరి లోనూ ఎవరి దగ్గిరా సుఖపడలేను. అలాంట

ప్పుడు ఆ ముసలి దుకాణ దారుడి కంటే ఈతనే నయం! ఇతను నీచమైన మనోవృత్తి కలవాడే అయినా చదువు కున్న వాడు. 'గోథే' పంక్తుల్ని వల్లించ గలడు."

ఆమె పైవిధంగా ఆలోచించుకు వుంటుంది. కానీ, వాస్తవానికి మా ఇద్దరిలో ఎవరు ఆమె పట్ల ఎక్కువ ప్రమాద కరమో అప్పుడామె నిర్ణయించు కోనలేక పోయి వుండ వచ్చును. తరువాత ఆమెకు యదార్థ స్థితి తెలిసే సరికి చాలా ఆలస్యం అయింది!

—o—

# 3

ఆమె నన్ను ప్రేమించలేదనీ తన వివశత్వం కారణంగా ఈ వివాహానికి ఒప్పుకున్న దనీ తెల్సి వుండి కూడా ఆమెను పెండ్లాడ గలిగి నందుకు నే నెంతో గర్వించాను. నా ఈగర్వాన్ని చూసే పాఠకులు నా నీచత్వాన్ని వూహించ గలరు! ఐతే, మరొక విషయాన్ని కూడా మర్చి పోవడానికి వీలు లేదు ; తాత్కాలికంగానే కానీ ; ఆమెను నేను ఘోరమైన నరకం నుండి విముక్తం చేశాను.

ఏమైనా కానీ, నేను చాలా ఆనందంగా వున్నాను. ప్రత్యేకం మా వయస్సులోని తార తమ్యాన్ని చూసి అధికంగా ఆనంద పడుతున్నాను. నా వయస్సు 41. ఆమె వయస్సు కేవలం 17 సంవత్సరాలు. మా యిద్దరి వయస్సులో ఇంత వ్యత్యాసం వున్నందుకు నిజంగా నేను సిగ్గు పడ వలసినది. కానీ నేను ఆనందంతో పొంగి పోతున్నాను. ఆ అనాఘ్రాత పుష్పం తన సమస్త సుకుమార మనః ప్రవృత్తుల సమీకరణతో నా ఆలింగన పాశంలో బంధింప బడినప్పుడు నాకు లభించ నున్న సుఖాన్ని వూహించుకు తన్మయుడ నవుతూ వుండే వాడిని.

నేను ఇంగ్లీషు పద్ధతిలో వివాహం చేసుకో దలచి నాను. ఇంగ్లీషు పద్ధతిలో అంటే నావుద్దేశ్యం పెండ్లి స్థానంలో నేను ఆమె మరి యిద్దరు సాక్షులు తప్ప మరెవరూ వుండ కూడదని. అలా పెండ్లి తంతు ముగిశాక ఆమెను తీసుకొని ఏనగరానికైనా పోయి ఏదో హోటల్లో గది తీసుకుని రెండు వారాల పాటు వుందా మను కున్నాను. కానీ, ఆమె నా ప్రస్తావనను కాదని ఇన్నాళ్ళుగా తనను ఏ అత్తలైతే కష్ట పెట్టి ఘోరంగా హింసించారో ఆ అత్తల దగ్గిరకే పోయి ఆశీర్వచనాలను పొందుదా మన్నది. ఆమె మొండిపట్టు పట్టడం వల్ల నేనూ వప్పు కున్నాను. నేనైతే ఒప్పుకున్నానే గాని, ఆ మేనత్తలు మాత్రం ఏవిధమైన వేడుకల్నీ నిర్వ ర్తించ డంలో లేశమైనా పాల్గొనమని స్పష్టంగా తెలియ చేశారు. చివరకు చెరొక వంద రూపాయల కాగితాన్ని చేతిలో పెట్టాక ఈ వివాహంలో పాల్గొనడానికి ఒప్పు కున్నారు. ఈ విషయాన్ని నేను నా కాబోయే భార్యకు ఏమాత్రమూ తెలియ నీయలేదు. ఎందు వల్లనంటే ; తన మేనత్తల ఈ ఘోరమైన నైచ్యానికి ఆమె మనస్సు-ఎ-నైనా బాధ పడవచ్చు !

ఏదో విధంగా దాదాపు అన్ని ఆచారాలతోటే వివాహ కార్యం జరిగింది. వివాహం తరువాత మొదటి సమా గమం రోజు నుంచి కూడా ఆమె నామీద ఎంతో సహృద యంతో వ్యవహరిస్తూ వచ్చింది. సాయంత్రం పూట దుకాణం సర్ది నేను ఇంట్లోకి పోయేసరికి, సంతోషంలో

వుప్పొంగుతూ నన్ను ఆలింగన పాశంలో బంధించడానికి ఎదురుగా వచ్చేది. నాకు తన చిన్నతనపువి, తరువాత జీవితంలోవి ఒక్కొక్క విషయాన్నే వినిపించేది. తల్లి దండ్రి దగ్గిర ఎలా రోజుల్ని దొర్లించిందో, ఎలాంటిసుఖ దుఃఖాలను అనుభవించిందో — మొదలయిన విషయాలన్నింటినీ గద్గద స్వరంతో నాకు చెప్పుకునేది. నా నుండి సానుభూతిని కోరేది. కానీ నేను చాలా నిరుత్సాహంగా అయిష్టంగా వినే వాడిని. దీనితో ఆమె యెంత వుత్సాహంగా నా దగ్గిరకు వచ్చేదో అంతే నిరుత్సాహి అయ్యేది. నేను కావాలనే అలా చేసేవాడిని, అందుకు కారణం కూడా వున్నది. నా దగ్గిర గట్టి నియమాలను పాటించ వలసి వుంటుందనీ, భావుకతలేని ప్రౌఢజీవితాన్ని గడప వలసి వుంటుందనీ, యీ విధంగా పరోక్షంగా ఆమెకు తెలియ చేయడమే నా ఆదర్శం ! నా యీ ప్రవర్తనవల్ల మా యిద్దరి మూల ప్రవృత్తుల్లో ఎన్నటికీ కూడని భిన్నత్వం వున్నదని కొద్ది రోజులలోనే ఆమె తెల్సుకున్నది. కాని చిత్రమైన విషయం ఏమిటంటే నేను ఎంతవరకు సౌమ్యంగా వుండి ఆమెకు అర్థమౌదామని ప్రయత్నించానో, నా ప్రవర్తన అంతేకటువూ, నేను అంతే దురూహ్యమూ అయిపోయాను ఆమెకు !

అహం భావమనే నైచ్యగుణ కారణంగా నేను ఆమెకు కొన్ని ప్రత్యేకమైన నియమాలను నియమించాను. అంతేకాకుండా ఆ నియమాలను పాటిస్తూనే నాదగ్గిర

జీవించవలసి వుంటుందనీ, లేని పక్షంలో నాదగ్గిర తనకు ఎలాంటి స్థానమూ వుండదనీ పరోక్షంగా తెలియ చేశాను. నా యీ గట్టితనాన్ని మరొక విధంగా చూడకండి. నా నియమాల మూలంలో హిత భావనతప్ప మరొక భావన లేదు. యదార్థానికి నా వుద్దేశ్యం ఆమెను కష్టపెట్టాలని కాదు. కాని, నేను అనుసరించిన మార్గం చాలా తప్పుడుదని ఇప్పుడు తెల్సుకున్నాను.

అసలు విషయం, సంసారపు ఖర్చులకు సంబంధించినంత వరకూ మా ఇద్దరిలోనూ భేదాభిప్రాయం వుండడం సహజమే. ఆమె నవ యవ్వన ! ఆమె హృదయంలో నూతనమైన కోర్కెలూ, ఆకాంక్షలూ, పొంగుతూన్నై. కాని, నేనొక అనుభవంకల మధ్య వయస్కుడిని. డబ్బును ఆమె ఎంత తుచ్ఛంగా చూస్తుందో నేను అంత గొప్పగా విలువగా చూస్తాను. కనుక, సంసారాన్నీ డబ్బునూ తుచ్ఛం అనుకోకూడదనీ అలా అనుకుంటే వైవాహిక మూల సిద్ధాంతాలకే చేటు వాటిల్లుతుందనీ చెబుతుండే వాడిని. కొన్నాళ్ళ వరకూ ఆమె నా వుపదేశాలను ఖండిస్తూ వచ్చింది. కానీ, తరువాత నా మొండి పట్టుకు తాళలేక తల వంచేసింది. ఏదైనా విషయం వివాదగ్రస్థమైనప్పుడు ఆమె మొదలకండా వూరుకునేది. అలా తర్కించకండా వూరుకోవడంలో అర్థం నా వాదనను ఒప్పుకున్నదని కాదు. నన్నూ నా వాదాన్నీ ఘోరంగా ద్వేషించి మాట్లాడడం కూడా

అనవసరమని వూరుకునేది. నా సిద్ధాంతాలూ, నియమాలు పైకి ఎంత కటువుగా, సంకీర్ణంగా వున్నా నేను ఆంతరంగికంగా సదాశయం కల వాడిననీ తడవ తడవకూ తెలియ జేస్తూ వుండే వాడిని. నేనలా తెలియ జేసి నప్పుడు ఆమె వెగటుగా అసహ్యించు కున్నట్లుగా నవ్వి వూరుకునేది.

ఇంకా అనేక మైన మూర్ఖపు క్రియల ద్వారా ఆమెమీద నా ప్రభావాన్ని వేయడానికి ప్రయత్నించాను. ఉదాహరణకు నేనొకసారి "యవ్వనం చాలా రమణీయమైనదయితే కావచ్చు! కానీ దానికి జీవితపు వాస్తవికమైన పరిస్థితులతో ఏ విధమైన సంబంధమూ వుండదు. ప్రౌఢత్వం అలా కాదు. గహనమైన అనుభవంతో అది జీవితాన్ని పరిశీలిస్తుంది! అంతే కాకుండా యవ్వన సౌందర్యం మానవునికి సహజంగానే లభిస్తుంది. కాని, ప్రౌఢత్వంలో లభించే వాస్తవికమైన విలువ దీర్ఘకాలంగా, బహిరాంతరంగిక సంఘర్షణల వల్ల స్వానుభవంతో ఆత్మను జ్వలింపచేసుకున్నప్పుడే లభ్యమాతుంది.!" ఈ విధంగా చెబుతూ నా జీవితం చాలా విలువైనదనీ, నా జీవితంముందు తన జీవితం అత్యంత అల్పమైనదనీ తెలియ చేసే వాడిని. ఆమె ఈ విషయంగా ఏ విధమైన ప్రతి వాదనా చేసేది కాదు. కేవలం తీక్షణమైన, వ్యంగ్య దృష్టితో నావంక చూస్తూ వూరుకునేది.

---

# 4

నేను విలాసానికి గానీ, జీవితానందం కోసరం గానీ తనను పెండ్లాడ లేదనీ, వివాహం అనే పేరుతో తనను ఒక స్త్రీరాస్థిగా కొనుక్కున్నాననీ ఆమెకు తెలియ చేశాను. యదార్థానికి ఆమెతో నేనీ విషయాన్ని ప్రత్యేకం చెప్పవలసిన పనికూడా ఏమీ లేదు. ఎందుచేత నంటే, నా యింటికి వచ్చిన రెండు మూడు రోజులకే తనకు ఇక్కడ వున్న స్థానం ఎలాంటిదో బోధపడిపోయింది. నేను రెండుగదుల్ని అద్దెకు తీసుకున్నాను. వాటిలో ముందుగది పెద్దది. దాన్నే దుకాణంగా వాడుకుంటాను. అదేగదిలో కొంత భాగాన్ని పార్టీషన్ చేసి ఆఫీసుగా కూడా వాడుకునేవాడిని. రెండవ గదిలో తిండి, వంటా, నిద్ర—గడుపుకునే వాళ్ళం! ఇదికాక మమ్మల్ని ఎవరైనా కల్సుకోవడానికి వచ్చినా అక్కడే కల్సుకోవడం కూడా జరుగుతూ వుండేది. ఆ గదిలో అతి సాధారణమైన ఫర్నీచర్ మాత్రం వున్నది. ఆ ఫర్నీచర్ సాధారణత ఒక్క మాటతో అర్థం అవుతుంది. అది ఆమె అత్తలకు కూడా నచ్చలేదు. ల్యూక్రెరియాను నా దగ్గరే పనికి పెట్టుకున్నాను. ఇంటి ఖర్చు కింద రోజూ ఒకరూపాయి మాత్రమే ఇస్తాననీ అంతకు మినహా ఒక్క పైసాకూడా అదనంగా ఇవ్వననీ నా భార్యతో స్పష్టంగా చెప్పేశాను; ఎలాంటి అవుసరం వున్నా అంతకుమించి కానీకూడా దొరకే

దన్నాను. ఈ లోభితనానికి కారణాన్ని కూడా ఆమెకు తెలియ చేశాను. "నేను రానున్న మూడు సంవత్సరాల్లో ముప్పై వేల రూపాయలను సంపాయించాలను కుంటున్నాను !"

ఆమె నా యేపనిలో కూడా ఎన్నడూ, ఎట్టి అభ్యంతరాన్నీ తెలియ చేయలేదు. నవయవ్వనవతి ఐన స్త్రీకి సినిమాలూ, వినోద ప్రదర్శనాలూ చూడాలనే కోర్కె వుండడం సహజం! కాని నేను మొదట్లోనే ఆమెలోని ఈ సంబంధమైన వుత్సాహాన్ని పూర్తిగా నశింప చేశాను. నెలకు ఒక్కసారి కన్నా సినిమాకు తీసుకుపోవడం జరగదని చెప్పాను. ఆ ఒక్క సారి కూడా అన్నింటికంటే తక్కువ శ్రేణి టికెట్టు తీసుకునే వాడిని ! మేమిద్దరమూ ఏమీ మాట్లకుండా మౌనంగా సినిమాకు వెళ్ళేవాళ్ళం; అలాగే మౌనంగా తిరిగి వచ్చేశే వాళ్ళం ! ఆమెతో సాధ్యమైనంత తక్కువగా మాట్లాడాలనే నియమాన్ని ఏర్పరచుకున్నాను. ఎందుకూ? అనడిగితే, సమాధానాన్ని ఈయలేను. స్వయంగా నాకూ తెలియదు కూడాను. సినిమానించి వచ్చేప్పుడు ఆమె మధ్య మధ్య కనుచివర్లనుంచి నన్ను చూసేది; బహుశా నేనేమైనా మాటాడతానేమోనని ఆమె ఆశ! మా యిద్దరిలోని మౌనం నిస్తబ్ధత దుర్భరమైన చరమస్థాయిని అందుకునేవి. అలాంటి సమయాల్లో దుర్భరమైన నా మౌనాన్ని భంగపరచడానికా అన్నట్టు నన్ను గాఢమైన తన ఆలింగన పాశంలో బంధించేది. కాని నేను క్షణిక భావోద్వేగాలకు వశమయ్యే తేలిక మనస్తత్వం కలవాడిని కాక పోవడంవల్లనూ, ఉన్నతమైన స్థాయి కల

వాడిని కావడం వల్లనూ ఆమె ఈ చేష్టలకు చలించే వాడిని కాదు. నా మౌనంలోగానీ, గంభీరతలోగానీ, ఏవిధమైన పరివర్తనా వచ్చేది కాదు. అందువల్ల క్షణికమైన ఆమె ఈ భావోద్రేకత ఎదురు దెబ్బకొట్టేది. అంటే ఇలా ఏరోజైతే నాచేత నిర్లక్ష్యం చేయబడేదో, ప్రతి క్రియరూపంలో మర్నాటి ఉదయాన్నే నాతో పోట్లాటకు సిద్ధపడేది. అసలు విషయం, ఆమె నామీద తన హృదయాంతరాళంలో ఘోరంగా ద్వేషాన్ని పెంచేసుకున్నది.

అలాంటి పరిస్థితిలో ఒక వేళ అమె నాతో పోట్లాడక పోయినా తన ప్రతిచేష్టలద్వారా నా మీద తనకువున్న ద్వేషాన్ని కనబరచేది. తన వివశత్వ పూర్ణమైన పరిస్థితికి విరుద్ధంగా కళ్ళగుండా అగ్నిజ్వాలల్ని కురిపించేది. ఆమెలోని ఈ విరుద్ధప్రవృత్తి రోజు రోజుకూ అభివృద్ధి పొందుతూనే వున్నది. తత్ఫలితంగా నేను నా భావాలను కోమలం చేసుకుని ఆమెతో నమ్రంగా, మృదువుగా వ్యవహరించడానికి బదులు మరీ కటువుగా, నిరసనగా వ్యవహరించ సాగాను.

మా యిద్దరిలోని వైమనస్యానికి ముఖ్య కారణం ఏమిటో పాఠకులకు ఈ పాటికి బోధపడి వుండ వచ్చును! ఆమె పూర్తిగా నూతన భావాలతో నిండిన మనిషి. డబ్బు...ఆదాయం...పొదుపు...ఇలాంటి లౌకిక విషయాలు ఆమె దృష్టిలో ఏమాత్రం విలువ లేనివి. అందుకు విరుద్ధంగా నేను, ఆమెకూ నాకూ సంబంధించిన ప్రతిచిన్న విషయాన్నీ ప్రాపంచక స్వార్థాల దృష్ట్యా చూసి లాభ నష్టాలను

తూచే వాడిని. ఇలా చేయడం ఆమెకు ఏమా త్రమూ ఇష్టం వుండేది కాదు. ఆమె తరుణ హృదయంలో జీవిత వైచిత్ర్యా తకు సంబంధించిన సుకుమార భావాలు తెర్లుతూ వుండేవి. కానీ ఎండువారిన, ప్రాపంచిక సంకీర్ణలతో నిండిన నా ప్రవ ర్తనవల్ల ఆ రంగుల ఇంద్రజాలంలో గహనమైన అంధకారపు ఛాయలు అలుముకునేవి. ఇందువల్ల ఆమె హృదయంలో నా మీద ద్వేషం ప్రజ్వరిల్లుతూ వచ్చింది. నేను సినిమాకు నెలకు ఒకసారితప్ప తీసుకు పోసన్నాను. ఇందుకు తన వ్యతిరేకతను తెలియచేస్తూ ఆమె అసలు సినిమాకు పోవ డమే మానేసింది. ఇలాగే బట్టల పొమపును గురించి కూడా కొంత మాట్లాడడంవల్ల ఇక ఎన్నటికీ కొత్తబట్టల్ని ధరించ నని శపథం పట్టింది. ఆమె గత జీవితంలో ఘోరమైన దరి ద్రాన్ని అనుభవించింది. అప్పటి ఆమె దరిద్రస్థితికన్నా ఇప్పటి ఆమెస్థితి ఎంతో నయం! అయినా, కొంచం పొదు పరిగా వుండమన్నంత మాత్రంచేత ఎందుకంత మండిప డేదో; ఎంత ఆలోచించినా నాకు బొత్తిగా అర్థం కాని విష యం అయింది. బహుశః తన సుఖస్వప్నాల భగ్నావశేషా లను చూసి కావచ్చును. ఆమె గత జీవితంలో ఎన్ని బాధలు పడ్డప్పటికీ భవిష్యత్తులో వుత్తమమైన, విలాస యుక్తమైన జీవి తాన్ని పొందగలననే ఒక రకమైన ఆశను జాగ్రత్తగా తన హృదయంలో పెంచుకున్నది. ఈ వివాహం ఆ ఆశను సిలు వునా విరిచింది! అంతే కాకుండా తను శాశ్వతంగా, మృత్యు పర్యంతం సంకీర్ణమైన, స్వార్థ యుక్తమైన బంధంలో

బంధింప పడ్డానని తెల్సుకున్నది. అందుకే ఈ ఆక్రోశం ! స్వప్న లోకాల్లో విహరించే 16 ఏండ్ల నవయవ్వనవతికీ, నా ఈపిసిని గొట్టుతనం, ప్రాపంచిక స్వార్థ పరత్వం.— యివి భవిష్యత్తుకు వుపయోగకరమైనవని ఎలా రుజువు చేయడం ! నాలాంటి సమాజంనుంచి బహిష్కరించ బడిన, పీడించ బడిన వ్యక్తికి, ఏవిధంగానే కానీ, ఎంత నీచమైన వృత్తిచేసైన గానీ—చివరకు వడ్డీవ్యాపారం చేసైనాగానీ, లక్షలు గడించే అధికారం వుందని ఎలా తెలియ చేయడం ?

ఆమె నా వృత్తిని అసహ్యించుకుంటున్నదనీ ఈ వడ్డీ వ్యాపారాన్ని అతి నీచమైన వృత్తిగా భావిస్తున్నదనీ నాకు తెల్సును. ఏ గౌరవ నీయుడు కూడా యిలాంటి వృత్తిని అవలంబించడని కూడా నాకు తెల్సు—కానీ ప్రత్యేకమైన పరిస్థితులు ఏర్పడ్డప్పుడు అన్ని పనులూ ఆచరణ యోగ్యములే. నా ఈవృత్తిని గురించి ఎవరయినా సానుభూతిగా ఆలోచించవచ్చుగాని ఆమె హృదయంలో మాత్రం ఈషణ్మాత్రమైనా క్షమా భావనలేదు. ఇందు గురించి నేను ఏమీ అనుకునే వాడినికూడా కాదు. "కొన్నాళ్ళు పోయిన తరువాత నా పొదుపరి తనంలోని వున్నతాశయాన్ని ఆమే అర్థం చేసు కుంటుంది. అప్పుడు నా కాళ్ళమీద పడి ఇప్పటి తన ప్రవర్తనకు క్షమార్పణ వేడుకొంటుంది" అనుకునే వాడిని. కానీ అత్యధికమైన అహంభావం వల్లనే అలా అనుకునే వాడినని ఇప్పుడు తెల్సు కున్నాను. ఆ అహంభావం వల్లనే నా హృదయం ముక్కలు చేస్తున్న ఈ దుర్ఘటన జరిగింది !

# 5

ఒకనాటి విషయం. నా దగ్గరకు ఒక వృద్ధురాలు అతి పురాతనమైన వస్తువు నొకదాన్ని కుదవ బెట్టడానికి తెచ్చింది. మా యిద్దరిలోనూ ఆరోజునే బాహాటంగా పోట్లాట జరిగింది. వృద్ధురాలు ఆ వస్తువును నాదగ్గిర తాకట్టు పెట్టి డబ్బు తీసుకు పోవచ్చింది. ఆ వస్తువును స్వర్గస్తుడైన ఆమె భర్త జ్ఞాపక చిహ్నంగా ఇచ్చి పోయాడు. చూస్తూనే వస్తువు విలువయిందని గ్రహించాను. అందువల్ల తాకట్టుగా కాకుండా ముప్పై రూపాయలకు శాశ్వతంగా కొనేద్దామను కున్నాను. నే నీవుద్దేశ్యాన్ని తెలియ చేయగానే ఆ ముసలిది వల వలా ఏడ్చింది. ఆ వస్తువు తనభర్త స్మృతి చిహ్నం కావడంవల్ల అమ్మడానికి వీలు లేదనీ, తాకట్టుగానే వుంచ వల్సిందనీ, బతిమలాడింది. నేను అందుకు అంగీకరించాను. నాలుగు రోజుల తరువాత ఆ ముసలిది ఒక పాతగాజును పట్టుకు వచ్చి కుదవ కట్టుక్రింద ఈ గాజుని వుంచుకుని తన 'స్మృతిచిహ్నాన్ని' యిచ్చివేయ వలసిందిగా కోరింది. ఆ గాజు విలువ ఎనిమిది రూపాయల కంటే ఎక్కువ వుండదు కనుక స్పష్టంగా నిరాకరించాను. ఆ సందర్భంలో నా భార్య నాదగ్గిరే కూర్చుని వున్నది. ఆ వృద్ధురాలు కరుణార్ద్రమైన చూపులతో నావైపు

చూసి అప్పటికి మెదలకొండా వెళ్ళిపోయింది. తరువాత ఒంటరిగా నాభార్య దగ్గిరకు వచ్చి, నామీద తన ప్రభావాన్ని వినియోగించి ఎలాగైనా తన 'స్మృతిచిహ్నాన్ని' ఇప్పించ వలసిందిగా ప్రార్థించింది.

తరువాత నాభార్య ముసలిదాన్ని గురించి నాదగ్గిర సిఫార్సు చేసింది. నేను శాంతమైన, దృఢమైన స్వరంతో ఆమె సిఫార్సును తిరస్కరించాను. అంతే కాకుండా వ్యాపార సంబంధమైన విషయాల్లో ఏ విధంగానూ జోక్యం కలిగించుకోవడానికి తనకు అధికారం లేదని స్పష్టంగా చెప్పాను. నాభార్య విచిత్రమైన క్రోధపూరిత దృష్టితో నావైపుచూస్తూ కొంతసేపు మౌనంగా నామాటలనువిన్నది. ఆ చూపులు దయ్యం పట్టినదాని చూపుల్లావున్నై. కొద్దిసేపు అలాగే చూసి, పిచ్చిదానిలా చివాల్న లేచి నిలబడి, నన్ను కాళ్ళతో తన్ననూ, చేతులతో కొట్టనూ సాగించింది. అప్పటి ఆమె ఆకారం క్రూర జంతువుల్ని స్ఫురణకు తెచ్చింది. ఆమె ఎంతకూ శాంతించలేదు. నేను విభ్రాంతితో నోట మాట లేక చూస్తూ నిలబడి పోయాను, స్థంభించి పోయాను. ఐదు నిమిషాలు ఆగి ఆమె కొంచెం శాంతించాక మళ్ళీ ఒకమాటు ఇలా అన్నాను "నాకు సంబంధించిన ఏ విషయంలోనూ నీవు జోక్యం కలిగించుకో నవుసరంలేదు ! " ఈమాటను విని ఆమె నన్ను నవ్వించడానికా అన్నట్టు హేళనగా నవ్వింది.

వివాహానికి ముందు మా యిద్దరిమధ్యా జరిగిన నిర్ణయాలలో ఆమె నా ఆజ్ఞ లేకండా బయటికి పోకూడదనే నిర్ణయం ఒకటి ! కానీ, ఈ నిర్ణయాన్ని త్రోసివేసి, ఆమె నా ఆజ్ఞలేకండానే బయటికి పోసాగింది. దీంతో నాకోపానికి హద్దులేక పోయింది. ఒక నాడామె సాయంత్రం వరకూ ఎక్కడెక్కడో తిరిగి వచ్చింది.

మరుసటి రోజు వుదయమూ సాయంత్రమూ కూడా ఎక్కడికో వెళ్ళింది నాఆజ్ఞ లేకండానే. లక్షణం ఏమీ బాగున్నట్టు కనుపించక పోవడం వల్ల వెంటనే దుకాణాన్ని కట్టివేసి మేనత్తల ఇంటికి వెళ్ళాను. వివాహం అయ్యాక ఇదే ప్రథమం వాళ్ళ దగ్గిరకు వెళ్ళడం ! నేను వెళ్ళాక ఆమె అక్కడికి రాలేదని చెప్పారు మేనత్తలు. నేను చెప్పిన విషయాలన్నింటినీ కుతూహలంగా విన్నారు. నా దుర్దశకు నవ్వారు. తరువాత ఇలా అన్నారు "నీకు తగిన ఆడది దొరికింది."

ఈ మాటకు నా ఆత్మ కుంచించుకు పోయింది. అవమానాన్ని నాలో నేనే మ్రింగి వూరుకున్నాను. ఆ యిద్దరిలో చిన్న ఆమెను ఒక సహాయం చేయ వలసిందని అర్థించాను. అందుకుగాను ఒక వందరూపాయలు లంచంగా ఇస్తానన్నాను; అడ్వాన్సుగా ౫౦ రూపాయలను ఇచ్చేశాను. తను నాకు చేయ వల్సిన సహాయమల్లా నా భార్య ప్రతిచేష్టనూ జాగ్రత్తగా కనిపెట్టి నాకు చెప్పడమే ! రెండు రోజుల తరువాత మేనత్త నాదగ్గిరకువచ్చింది. నా భార్య ఇలా బయ

టికి వెళ్ళే విషయంలో కర్నల్ ఎఫిమోవిచ్‌కు కూడా కొంత సంబంధ మున్నదని చెప్పింది. కర్నల్ ఎఫిమోవిచ్ నాకు తెలిసిన వాడే. అతను నాతోపాటు మిలటరీలో వుద్యోగం చేశాడు అప్పుడు కూడా నాపట్ల చాలా అన్యాయంగా వ్యవహరించాడు. తరువాత వివాహానంతరం ఒకటి రెండు సార్లు అతను నాకొట్టు దగ్గిరకు రావడం కూడా జరిగింది. ఆ రెండు సార్లూ నాభార్యతో చాలా సంతోషంగా నవ్వుతూ మాట్లాడాడన్న విషయం ఇప్పుడు జ్ఞాపకానికి వస్తున్నది. అక్కడికీ జాగ్రత్తపడి ఇకనీవు ఎన్నటికీ నాకొట్టు దగ్గిరకు రానవుసరం లేదని ఖచ్చితంగా చెప్పాను. అప్పటిలో అతడు ఇంత నైచ్యానికి పాల్పడతాడని నేను అనుకోలేదు. నాభార్యను రెచ్చగొట్టి తప్పు దారులకు పట్టించేటంత నీచానికి దిగుతాడని నేను తలంచలేదు.

చిన్నత్త మరి ఈవిధంగా కూడా చెప్పింది. "ఆమె ఇప్పుడు కర్నల్ దగ్గిరకే వెళ్ళింది. త్వరలో మాఇంట్లోనే ఒక మాటు కల్సుకో నిశ్చయించు కున్నారు !" అని నాభార్యా, కర్నలూ కల్సుకోవడానికి నిర్ణయించుకున్న తేదీని తెలియ చేసింది.

కర్నలూ, నాభార్యా కల్సుకో దల్చుకున్న గదికి ప్రక్కనే వాళ్ళకు కనపడకుండా వుండి వాళ్ళ వ్యవహార మంతా కనిపెట్టాలని నేను, నిర్ణయించు కున్నాను.

నేను ఆమె అత్తల దగ్గిరకుపోయి సర్వ విషయాలనూ తెల్సుకు వచ్చిన రోజున ఆమె బాగా ప్రొద్దుక్రుంకిన తరువాతగాని ఇంటికి రాలేదు. పైగా వచ్చిన దగ్గిర నుంచీ అదో రకంగా ఎలాగయినా నన్ను కవ్వించి పోట్లాట పెట్టుకో దలచిన దానిలా ప్రవర్తించ సాగింది. కొన్నాళ్ళుగా ఆమె ప్రవర్తనలో కనుపిస్తున్న ఈమార్పువల్ల ఆమె శాంతమైన, సభ్యమైన స్వభావానికి మొదట ఎంత సంతసించానో; అంత క్షోభ పడుతున్నాను.

లోపలికి వస్తూనే ఆమె క్రోధోన్మత్తతతో అత్యంత వుద్దండతతో ఇలా అడిగింది. "అయితే, నీవు ద్వంద యుద్ధంలో పాల్గొనక పోవడంవల్ల ఉద్యోగం నుంచి తీసివేయ బడ్డావుట. నిజమేనా?"

"అవును, నిజమే ! నా స్నేహితులు... మరొక బెటాలియన్ లోకి పొమ్మన్నారు. కానీ, నేను నిరాకరించాను!" సమాధానం చెప్పాను.

"ఐతే, నీవు పిరికి వాడివనికదా వుద్యోగంనుంచి తొలగించింది !"

అవును; నాతోటివాళ్ళు నన్ను పిరికి వాడనే అనుకున్నారు. నేనొక అమాయకుడూ, నిర్దోషి అయిన వ్యక్తితోటి ద్వంద యుద్ధానికి దిగక పోవడమే అలా అనుకోవడానికి కారణం! వారి దృష్టిలో ఆ వ్యక్తి నన్ను అవమానించాడు. కానీ యదార్థానికి అతనేమీ నన్ను అవమానించలేదు.

నన్నేమీ అవమానించని ఆ వ్యక్తి మీదకు ద్వంద యుద్ధానికి సిద్ధపడి, నావో అతనివో ప్రాణాలను పోగొట్టుకోవడం అవివేకం అనుకున్నాను. ఇది వాళ్ళదృష్టికి పిరికితనం కావచ్చును, మరొక దృష్టికి నా సదాశయం గోచరించకపోదు."

ఆమె తనలోని నామీది అసహ్యాభావం వెలికి కనుపించేలా నవ్వింది. తరువాత రెండవప్రశ్న వేసింది. "మరి నీవు ఉద్యోగం పోయాక పీటర్స్‌బర్గు రోడ్లమీద అడుక్కుంటూ జీవితాన్ని గడిపావుట? రాత్రిపూట ''బిలియర్డ్సు" ఆడే బల్లల క్రింద పడుకుని రోజుల్ని గడిపావుట?"

"నౌకరీ పోయాక నేను అనేక బాధలు పడ్డాననే మాట యదార్థం! చాలా హీనదశలో కూడా రోజుల్ని దొర్లించాను. కానీ నేను ఆర్థికంగా ఎంత హీనదశలోనైనా వుండనీ, నైతికంగా మాత్రం హీనదశకు ఎన్నడూ పోలేదు. ఎందువల్లనంటే నే నారోజుల్లో, జీవితాన్ని గడిపిన ఆ పరిస్థితుల్ని స్వయంగా నేనే అసహ్యించుకునే వాడిని. కాకపోతే పరిస్థితుల ప్రభావంవల్ల వివశంగా ఆ జీవితాన్ని గడపవలసి వచ్చింది !"

"సరే, వెనక అడుక్కున్నావు ! ఇప్పుడు మార్వాడీవి అయ్యావు !"

ఈయెత్తిపొడుపు ద్వారా, నేను వెనక చేసిన వృత్తులకంటే ఇదేమీ గొప్పవృత్తి కాదన్నది. ఈ వ్యంగ్యానికి నాగుండెలు లోపల్లోపలే మండాయి, కాని నేనేమీ మాట్లాడలేదు.

కొంతసేపు మౌనంగా కూర్చున్న తరువాత "మరి, నీ ఈ గతజీవితాన్ని గురించి ఎన్నడూ మాట మాత్రమైనా తెలియ చేయలేదు !" అన్నది. ఆమెకు నేనేమీ సమాధానం ఈయలేదు. ఆమె అవతలకు వెళ్ళిపోయింది.

మరుసటిరోజు సంధ్యా సమయాన, నాభార్యా, కర్నలూ—ఇద్దరూ గుప్తంగా కలుసుకోవడానికి నిర్ణయించుకున్న గదికి ప్రక్కనే రహస్యంగా దాగాను. వారు నా అదృష్టాన్ని ఎటు మళ్ళించ దల్చుకున్నారో వారి సంభాషణ ద్వారా రహస్యంగా తెల్సుకోదల్చుకున్నాను. ఎందుకయినా వుపయోగమని నిండు రివాల్వరు నొకదాన్ని జేబులో సిద్ధంగా వుంచుకున్నాను. నాభార్య తనకువున్న వుత్తమమైన వస్త్రాలను ధరించి వచ్చింది. ఎఫిమోవిచ్ కూడా బాగా తయారై వచ్చాడు. యిద్దరూ రహస్య సంభాషణలకు వుపక్రమించారు. నేను చెవులు రిక్కించి అతి జాగ్రత్తగా వినసాగాను. కర్నల్ నాభార్య కాళ్ళమీద, హృదయ కవాటాల్ని తెరచి ఆత్మనూ, ప్రేమనూ పడవేయడానికి ప్రయత్నం చేస్తున్నాడు. నేను గవాక్షపు సన్నని రంధ్రాల గుండా, వారిద్దరినీ తదేకదృష్టితో చూస్తున్నాను. వారిద్దరి స్వభావాల్లోని వ్యత్యాసాన్ని గురించి ఆలోచిస్తున్నాను. కర్నల్ నాదృష్టికి అతి ఏహ్యమైన వస్తువులా, కామపూరితుడైన కుక్కలా కనుపిస్తున్నాడు. నాభార్య అతినిష్కపటమయినది, సుకుమార స్వభావం కలది,

స్వాభిమానిని— అలాంటిది ఈ పశువుతో ఏకాంతంలో మాట్లాడడానికి ఎలా ఒప్పుకున్నదా? అని ఆశ్చర్య పడ్డాను. కానీ, కర్నల్ యొక్క నీచమైన ప్రవృత్తులు నాభార్యకు తెలియవా? ఎందుకు తెలియవు, తెలుసు! అందువల్లే అతను తన మనోగత ప్రేమభావాల్ని వుద్రిక్తుడై తెలియపరుస్తూ వుంటే ఆమె వ్యంగ్యోక్తులతో అతని మాటలను ముక్కల క్రింద చీల్చి పారేస్తున్నది. కానీ, వాడు...కర్నల్...మహా ఘటికుడు; ఒక్క మాత్రానికి ఓటమిని ఒప్పుకోడు! మెల్ల మెల్లగా కుర్చీని జరుపుతూ చివరకు నాభార్యకు చాలా దగ్గరకు పోయాడు.

అసలు విషయం: ఆమె నామీద ద్వేషంతో ఎలాగయినా నన్ను అవమాన పరచాలనే వుద్దేశ్యం కడుపులో పెట్టుకుని కర్నల్ ఎఫిమోవిచ్‌తో వంటరిగా మాట్లాడడానికి వప్పుకున్నది. మొదట్లో అతని సంస్కార రహితమైన ప్రవృత్తులు ఆమెకు తెలియక పోవచ్చును. కాని రెండు మూడు మాటల్లోనే అతని కుసంస్కారాన్ని గ్రహించింది. నేను అక్కడికి పోయిన కొద్ది క్షణాలలోనే ఒక విషయాన్ని రూఢిగా తెల్సుకున్నాను; ఆమె నన్ను ఎంతయినా ద్వేషించవచ్చు—కానీ, కర్నల్‌లాంటి సంస్కార హీనుడిని ఎన్నటికీ ప్రేమించలేదు. నాభార్య తడవ తడవకూ వంగ్య వాగ్బాణాలతో ఆతని హృదయాన్ని క్షత విక్షతం చేసింది. చివరకు కర్నల్ క్రోధోన్మత్తుడయ్యాడు. లేచి నిలబడ్డాడు. ఎక్కడ చెయ్యి చేసుకుంటాడోనని భయం వేసింది.

నేను అనుకున్నట్లే జరిగింది. ఆమె కర్నల్ మాటల్లో పడలేదు. సంసారాన్నీ, కాంతినీ, మంచినీ—ప్రేమించ గలిగి కుసంసారాన్నీ, అంధకారాన్నీ చెడ్డనీ—ద్వేషించగల ఆమె ఈసునిసిత స్వభావాన్ని చూసే నేను ఆమెపట్ల ఇంత ప్రబలంగా ఆకర్షితుడ నయ్యాను. నన్ను ఎంతగానైనా ద్వేషించనీ, కానీ, తనచరిత్రను ఆమె ఎన్నటికీ కించపరుచు కోదని నా దృఢ విశ్వాసం ! అలా ఐనప్పుడు ఇక రివాల్వర్ని వెంట తేవల్సిన అవుసరం ఏంకలిగింది? అనే ప్రశ్న రావ చ్చును. ఇది నా వికృత స్వభావ పరిణామం !

రెండు క్షణాల తరువాత నేను అగస్మాత్తుగా తలుపులు తెరచుకుని వాళ్ళున్నగదిలోకి ప్రవేశించాను. ఎఫిమోవిచ్ ఆశ్చర్యంతోటీ, భయంతోటీ ఎగిరి పడ్డాడు. నేను కనుచివర్ల నుంచి ఒకమాటు అతనివంకచూసి మౌనంగా నాభార్య చేయి పుచ్చుకుని గది బయిటికి నడిచాను. నాభార్య కూడా నేనిలా ఆకస్మికంగా రావడంతో చాలా కంగారు పడ్డది. పైకి మాత్రం అతి ప్రశాంతంగా వున్నది. మౌనంగా నావెంట నడిచింది.

ఇంటికి వచ్చాక ఒక కుర్చీలో కూర్చుని తదేకంగా నావంక చూస్తూ వుండిపోయింది నా భార్య. ఆమె పైకి ఎంత ప్రశాంతంగా కనుపించినా, ముఖంలో మానసికమైన ఆందోళనల తాలూకు ఒకరకమైన కళాహీనత స్పష్టంగా కనుపిస్తున్నది. పైగా ఏదో అస్పష్టమైన భయంకూడా ముఖంలో

కనుపిస్తున్నది. బహుశా, నేను తన్ను హత్యచేస్తానన్న భయమై వుండవచ్చును. పైగా తనకేమీ మృత్యుభయం లేదని నాకు తెలియ చేయడానికి గాను, పళ్ళను బిగబట్టి ఒక రకం అయిన నిర్లక్ష్యాన్ని కూడా ముఖంలో తోచేట్లు చేస్తున్నది. కాని ఆమె అనుకున్నట్టు నేను ఆమెను చంపనూలేదు, తన్ననూలేదు. జేబులోని పిస్టల్‌ను తీసి డ్రాయరుమీద పెట్టి మెదలకండా వెళ్ళిపోయాను. ఆమె ఒకమాటు పిస్టల్ వంక చూసి దృష్టిని క్రిందికి దించేసుకున్నది.

ఆమె భయాన్ని గానీ, గాభరాను గానీ, ఏమాత్రం గమనించనట్టు నిర్లక్ష్య భావాన్ని ద్యోతకం చేస్తూ, బజారు గుడ్డల్ని విప్పి మంచంమీద పడుకున్నాను. నిజంగా నేను అప్పుడు ఎటూ పడుకోక తప్పదు. మానసికాందోళనవల్ల బాగా అలసి పోయి వున్నాను. పైగా రాత్రి 11 దాటింది. నేను పడుకున్న తరువాత ఆమె గుడ్డల్ని మార్చకండానే ఒక సోఫాలో పడుకున్నది. మే మిద్దరం విడి విడిగా పడుకోవడానికి ఆరోజే మొదలు.

—o—

# 6

మరుసటిరోజు వుదయాన ఒక ఘోరమైన సంఘటన జరిగింది. దాదాపు వుదయం ఎనిమిది గంటలాచాయల పడుకునే కళ్ళు తెరచి బద్ధకంగా గదిని నాలుగు వైపులా కలయ చూశాను. నాకండ్లను నేనే నమ్మలేక పోయాను. చేతిలో పిస్టల్‌తో నా భార్య డ్రాయరు దగ్గిర నిలబడి కనుపించింది. నేను మేలుకునే వున్నాననీ, తను చేయబోతున్న దుష్కార్యాన్ని చూస్తూనే వున్నాననీ ఆమెకు తెలియదు. పిస్టల్‌తోసహా ఆమె నావైపుకు నడిచింది. నేను కండ్లు మూసుకుని నిద్రను నటించాను.

ఆమె మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ నా మంచం దగ్గిరకు వచ్చింది. నా శ్రవణశక్తి అత్యంత తీవ్రంగా పనిచేయసాగింది. గదిలో వ్యాపించిన ఘోరమైన నిశ్శబ్దతలోని "నిశ్శబ్దాన్ని" కూడా నా చెవులు వినసాగినై అంటే నా శ్రవణశక్తియొక్క తీవ్రతను అంచనా వేసుకొనవచ్చును! నేను కండ్లుమూసుకునే వుందామని ఎంతో ప్రయత్నించాను, కానీ, నా ప్రయత్నానికి విరుద్ధంగా నాకండ్లు తెరుచుకున్నై, క్షణకాలంపాటు. గుండెలుఆగినంత పనైంది. మృత్యువే సాక్షాత్కరించిందా అనేట్టు నా కణతలకు పిస్తో

లను గురిపెట్టి నిలబడి వున్నది ఆమె. నేను వప్పున కండ్లు మూసేసుకున్నాను. అప్పుడప్పుడు గాఢ నిద్రలోకూడా క్షణకాలంపాటు కండ్లు వాటంతటవే తెరుచ్చుకోవడం సహజం. నేనలా కండ్లు తెరవడాన్ని గురించికూడా ఆమెకు ఆ అభిప్రాయమే కలిగి వుండవచ్చును. ఆమెకు ఇదే అభిప్రాయం కలిగిందని చెప్పడానికి మరొక గట్టిఆధారంకూడా వున్నది. నేను వెంటనే కండ్లు మూసుకుని గాఢనిద్రను అభినయించడంవల్ల "మేలుకొని వుండినట్లయితే, కనీసం ప్రాణరక్షణ కోసమైనా లేచి కూర్చునేవాడు కదా!" అని అనుకుని వుండవచ్చును ఆమె.

"ఒకవేళ ఆమె నేను నిద్రను నటిస్తున్నట్టు తెలుసుకున్నదేమో!" ఒక్క క్షణకాలం ఈ ఆలోచన నాబుర్రలో విద్యుత్‌స్పర్శలా పరుగిడింది. మళ్ళీ ఒక ఆలోచన వచ్చింది. "ఒకవేళ నానటన ఆమెకు తెలిసినా, నష్టమేమీలేదు. ఆమెవల్ల మృత్యువంటే నాకు ఎంత నిర్లక్ష్యమో స్పష్టంగా తెల్సిపోతుంది. దాంతో నన్ను చంపే ప్రయత్నాన్ని విరమించుకుంటుంది. పిస్తోల్‌ని పేల్చలేక ఆమె చేతులు వణికిపోతై!"

కొంతసేపటి వరకూ గదిలో ఘోరమైన నిస్తబ్ధత వ్యాపించింది. తరువాత పిస్తోల్ ముందుభాగం నా కణతలకు తగిలిన గట్టిస్పర్శ అనుభవానికి వచ్చింది. నాగుండెల్లో సన్నని వణుకు లాంటిది బయలు దేరింది; కానీ, నేను కండ్లు తెరవలేదు. మృత్యువును అంతదగ్గరలో చూసికూడా నిద్రను

ఎలా నటించావు? ఎందుకు నటించావు? అని ఎవరైనా నన్ను అడగవచ్చు; అందుకు కారణం లేకపోలేదు. ఆమె నన్ను పిరికి వాడనుకున్నది. నేను పిరికివాడిని కాదనీ, ప్రాణాలను కూడా లక్ష్యపెట్టని ధీరత్వం నాలో కూడా వున్నదనీ ఆమెకు తెలియ చేయాలి. మరొక సన్నని ఆశ కూడా నాలో లేక పోలేదు; బహుశే ఆమె నన్ను నిద్రావస్థలో చూసి ఈ క్రూర కర్మ నుండి విరమిత కావచ్చు!

కొన్ని క్షణాల వరకూ నే నిలాగే మృత్యుశాంతిలో వున్నాను. జీవితంమీద ఒకరకమైన విరక్తి కూడా నాలో పనిచేయ సాగింది ఆక్షణాన. "ఎంతగానో, ప్రేమించిన నా భార్యయే నన్ను చంపడానికి సిద్ధం ఐనప్పుడు ఇకనేను బ్రతికి మాత్రం ప్రయోజనం ఏమిటి? ఎందుకు బ్రతకడం?' అనుకున్నాను.

కొద్దిసేపటి తరువాత ఆమె నా కణతలమీంద నుంచీ పిస్తోల్‌ను తీసివేసింది. మందమైన అడుగుల శబ్దాలవల్ల ఆమె నా గదిలోనుంచి వెళ్ళిపోతున్నదని వూహించాను. కొద్ది సేపటిలోనే ఆమె గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయింది. నేను విజయోల్లాసంతో ఒక్కమాటు కండ్లు తెరిచాను. ఈ సంఘటనవల్ల ఆమె మనస్సులో నా ప్రతిభావం గాఢంగా హత్తుకుంటుందనీ, ఆమె ఇకనాకు శాశ్వతంగా వశ్యురాల వుతుందనీ అనుకున్నాను.

ఆమె రెండవ గదిలోకి పోయింది. నేనూ అక్కడికి పోయాను. నిశ్శబ్దంగా టీ తయారు చేశాను. ఆమె కూడా మౌనంగా ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నది. ఆమె ముఖం పాలిపోయి భీతిని గొలుపు తున్నది. రక్తం విరిగి తెల్ల పడ్డ ఆమె పెదవులమీద ఆకస్మికంగా ఒక కృత్రిమమైన హాసం మెరిసింది. "ఐతే, నా చేష్టను నీవు చూడలేదా? చూశావా?" అని ప్రశ్నిస్తున్నట్టుగా వున్నై ఆమెకండ్లు. నేను వుదాసీన భావాన్ని ద్యోతకంచేస్తూ ఆమె ముఖంలోనుంచి చూపుల్ని దించేసు కున్నాను.

రెండు జాముల వేళ బజారుకుపోయి ఒక ఇనుప మంచాన్ని, ఒక "స్క్రీన్"నీ కొనుక్కొచ్చాను. "స్క్రీన్"ని "పార్టీషన్"గా గది మధ్యలో నిలబెట్టి, ఆమె పడుకోవడానికి ప్రత్యేకమైన స్థలాన్ని ఏర్పాటు చేశాను. ఆ ప్రత్యేక స్థలంలో ఇనుప మంచాన్ని వేశాను. నేను ఆమెతో ఒక్క మాటా చెప్పలేదు. ఆమె కూడా నాతో ఏమీ మాట్లాడలేదు. ఈ పార్టీషన్‌తో నేను తన అకృత్యాన్ని చూశానని నిర్ణ యించుకున్నది.

ఆ రోజు రాత్రి ఆమె చాలా ప్రశాంతంగా వున్నట్టు కనుపించింది. కానీ, మరుసటిరోజు వుదయమే తీవ్రజ్వరంతో మంచాన పడ్డది. దాదాపు ఆరువారాల తరువాత మంచంలో కాలు క్రింద పెట్టింది.

—o—

# 7

రోగంలోవున్న ఆరువారాలూ నేనూ, ల్యూకేరియా, ఇద్దరమూ ఆమెకు రాత్రింబవళ్ళూ సేవ చేశాము. మేము ఇద్దరమే కాక ఇంకొక పనిమనిషిని కూడా ఆమె సేవ నిమిత్తం పెట్టాను. ఈసారి నేను డబ్బుగురించిన యోచనను నా మనస్సునుంచి పూర్తిగా తొలగించేసుకున్నాను. ఆమె కోసరం, ఆమె ఆరోగ్యం కోసరం ఎంతైనాడబ్బు ఖర్చుపెట్టాలనే తెగువ నాలో పనిచేయ సాగింది. ఇంటికివచ్చి చూసిపోవడానికి సమర్థుడైన డాక్టర్ నొకరిని నియమించాను. అతనికి ప్రతిసారీ ఫీజుక్రింద 10 రు. ఇస్తూ వుండేవాడిని.

ఆరు వారాలకు కొంత స్వస్తత దొరికిన తదుపరి ఒకనాడు, నా మంచానికి చేరువలో వున్న ఒక మేజాముందు మెల్లిగా వచ్చి కూర్చున్నది ఆమె. ఆ మేజా ఆమెకోసం కొన్నదే. కొంత సేపటి వరకూ నేనేమీ మాట్లాడలేదు. ఆమే ఏమీమాట్లాడలేదు. ఆమె అలా మౌనంగా కూర్చోవడానికి కారణం; క్రితం జరిగిన విషయానికి ఇప్పుడు సిగ్గుపడుతున్నది గావును అనుకున్నాను. నా సేవా శుశ్రూషల్నీ, తన జబ్బును గురించిన నా నిజమైన ఆత్మ చింతననూ, తన కొరకు ఏసంకోచమూ లేకండా ధారవగా ధనం వ్యయం చేయడాన్నీ చూసి ఆమె నామీద తనకు వున్న వెగటి అభిప్రాయాన్ని మార్చుకున్న దనుకున్నాను. దాంతో నా ప్రభావం ఆమె మీద గాఢంగా పడ్డదని నిర్ణయించు కున్నాను. ఈ భావనతో నా అహంకారం అడ్డులేకండా పెరిగిపోయింది.

ఈ అహంకారం కారణంగానే, నేను పెదవు మెదిపి ఆమెతో మాట్లాడలేదు. ఇక నా పిసినిగొట్టు తనాన్ని ఆధారంగా తీసుకుని నన్ను ఎన్నటికీ అవమానించ లేదని సంతసించాను.

నేను గతజీవితంలో చాలా చేదైన అనుభవాలను గడించాననీ, మానవ సమాజం నన్ను ఘోరంగా ద్వేషించి వేసిందనీ, తత్ఫలితంగా మొత్తం మానవ సమాజం మీద, నాలో ఒక రకమయిన ద్రోహ భావన జాగరిత మయినదనీ మొదట్లోనే చెప్పాను. నేను సైనికోద్యోగి పదవినించి అతి అన్యాయంగా, కల్పితమయిన కారణాలతో తొలగింప బడ్డాను. ఆలా ఉద్యోగంనుంచి తొలగింప బడడంవల్ల భవిష్యత్తుకు సంబంధించిన నాలో రేకలూ, ఆశయాలూ అన్నీ మట్టిపాలై పోయినవి. నామీద నాకే ఒకరకమైన అసహ్యభావన ఏర్పడ్డది. అసలు నేను వుద్యోగంనుంచి ఎలా తొలగింప బడ్డానంటే; ఒకరోజున సినిమా చూద్దామనే వుద్దేశ్యంతో థియేటర్‌కు వెళ్ళాను. ఇంటర్‌వెల్‌లో ఏమైనా ఫలహారం తీసుకుందామని థియేటరు లోనే వున్న ఫలహారశాలకు వెళ్ళాను. అక్కడికి ఇతర సైనికోద్యోగులు చాలా మంది వచ్చారు. మా బెటాలియన్ వుద్యోగిని నేను ఒక్కడిని మాత్రమే. ఆ ఇతర సైనికోద్యోగుల్లోని ఒక వుద్యోగి, మా బెటాలియన్‌లోని బెజుమస్టోవ్ అనే వుద్యోగిని తీవ్రంగా నిందించాడు. బెజుమస్టోవ్ తప్పత్రాగి థియేటర్ హాల్లో పడివున్నాడనీ, నోటికి వచ్చినట్లు అశ్లీలాలను వాగుతున్నాడనీ, చుట్టుపట్లవాళ్ళు అతని మాటల్ని వినలే

కండా వున్నారనీ—అన్నాడా వుద్యోగి. ఇది పూర్తిగా అసత్యమైన వార్త. ఆరోజున బెజుమస్టోవ్ సారాయిని అసలు త్రాగనే లేదు. మరునటి రోజున మా బెటాలియన్ ఆఫీసర్లకు ఈ విషయం తెలిసింది. పైగా బెజుమస్టోవ్‌ని అవమానించిన ఆ వుద్యోగిని నేనేమాత్రం విరోధించ లేదని కూడా తెలిసింది. నేను వాస్తవానికి ఈ విషయాన్ని వ్యక్తిగతవిషయంగా స్వీకరించాను. మా బెటాలియన్‌కీ, దీనికీ ఏవిధమైన సంబంధమూ లేదను కున్నాను. కానీ, తోటివుద్యోగులు దీన్ని ఒప్పుకో లేదు. ఇలాంటి మాటలవల్ల మొత్తం బెటాలియన్‌కే అవమానం వస్తుందన్నారు. కనుక బెజుమస్టోవ్‌ను అవమానించిన సైనికోద్యోగిని ద్వంద యుద్ధానికి పిలవడం నా ప్రథమ కర్తవ్యం అన్నారు. నేను అలాంటి ఉత్తమ కర్తవ్యాన్ని నిర్వహించక పోగా అసలు దాని అస్థిత్వాన్ని గురించే సంశయాన్ని వెలిబుచ్చాను. తత్కారణంగా మిలటరీ వుద్యోగం నుంచి వైదొలగ వలసివచ్చిందినేను. ఉద్యోగం మానుకున్న తరువాత నా ఆర్థికస్థితి అతి దుర్భరంగా మారిపోయింది. గతిలేక మాస్కో బజార్లల్లో అడుక్కోవడానికి సిద్ధపడ్డాను. నే నలా మూడు సంవత్సరాల వరకూ ఘోరమైన ఆపదల్ని ఎదుర్కొంటూ, అతినైచ్యమైన, దుర్భరమైన జీవితాన్ని గడిపాను. తరువాత ఒక అద్భుతమయిన సంఘటన జరిగింది. ఆ సంఘటన కారణంగా నా భాగ్యం పండిందనే చెప్పాలి. నా పెంపుడుతల్లి ఒకామె చనిపోయింది. ఆమె చావుతో ఆమె తాలూకు మూడువేల రూపాయలు నాకు సంక్రమించి

నయ్యి. ఆ డబ్బుతో వడ్డీ వ్యాపారాన్ని సాగించి ఒక పెద్ద మొత్తాన్ని ఆర్జించే వరకూ అత్యంతమైన పిసినిగొట్టుగా వుండాలని నిశ్చయించుకున్నాను. తరువాత దీర్ఘమైన నా వంటరి జీవితంతో విసిగిపోయి వివాహం చేసుకో దలచాను. అదృష్టవశాత్తూ, జీవితంలో గుణ గణాల్లో అన్నింటిలో నాకు తగునని పించేలాంటి అమ్మాయితో పరిచయం ఏర్పడ్డది. ఆమె నాకు తగిన భార్యగా వుండగలదని విశ్వసించాను. కానీ ఇవ్వాళ నా అంతరాత్మ నన్ను ఘోరంగా నిందిస్తున్నది. ఆమెను పెండ్లిచేసుకుని నేను ఎన్నటికీ సవరించుకో లేని పొరపాటును చేశానంటున్నది. ఆమె జీవితానికి తీరని అన్యాయం చేశావని నిందిస్తున్నది నా అంతరాత్మ. నిజం కూడా అంతే! వాస్తవానికి నేను ఆమెకు తగిన భర్తను కాను. మా ఇద్దరి మూల స్వభావాల్లో చాలా భేదంవున్నది. ఆమె తన బాధలూ, వివశత్వం కారణంగా నన్ను పెండ్లాడడానికి సిద్ధపడ్డది. కానీ, నేనో? పూర్తిగా అంధుడనైపోయాను! ఏసుఖాన్ని కాంక్షించి ఆమెను పెండ్లాడినట్టు? నిదానంగా ఆమెనూ, ఆమె స్వభావాన్నీ నా ఆదర్శానికి అనుకూలంగా మార్చుకోవచ్చని అభిప్రాయ పడ్డాను. కార్యరూపంలో మాత్రం నా అభిప్రాయం పూర్తిగా దెబ్బతిన్నది. ప్రతిచిన్న విషయానికీ, ఆమెకూ నాకు మధ్య వైమనస్యం పెరుగుతూ వచ్చింది. ప్రతిమానవుడిలోనూ కనీసపు స్థాయిలోనైనా మంచిప్రవృత్తులు వుంటయ్యి. దురదృష్టవశాత్తూ ఆమెకు మొదట నాలోని చెడ్డగుణాలూ ప్రవృత్తులే కనుపించినయ్యి.

నేనూ పూర్తిగా చెడ్డగుణాల కూటమిని కానని, మంచిగుణాలూ ప్రవృత్తులూ కూడా నాలోవున్నవనీ తెలియచేసే అవకాశమే దొరకలేదునాకు. నా విరోధులు నాలోని నైచ్యాల్నే ఆమెకు తెలియ జేశారు. నా ఔన్నత్యాన్ని ఎవ్వరూఆమెకు తెలియ చేయలేదు. అందుమూలంగా ఆమె నన్ను ఒట్టి నీచుడిగా, అధముడిగా ఎంచుకున్నది మనస్సులో.

కానీ, ఈపిస్తోల్ సంఘటన నా మీద తన మనస్సులో ఇన్నాళ్ళుగా గూడు కట్టుకుంటున్న భావనను పూర్తిగా మార్చేసింది. ఆమెలోని నామీది అభిప్రాయాలు కూడా మారినవి. నేను తననుకున్నంత పిరికివాడిని కాదని గ్రహించినట్టు నేను ఆమె ప్రవర్తనవల్ల అర్థం చేసుకున్నాను. నా గురించి ఆమెలో కొంత ఔత్సుక్యం, కొంత గౌరవం ఏర్పడ్డది. ఆమెలోవచ్చిన ఈ పరివర్తనకు నేను చాలా సంతసించాను. కాని,సంతోషంతో పాటు ఒక సన్ననిబాధా, నిరాశా నా గుండెలను కొరికివేయ సాగినై; ఆమె గౌరవాన్ని పొందగలిగాను, కానీ ఆమె ప్రేమను ఎన్నటికీ పొందలేనేమో!

అయినప్పటికీ నేను ఓటమిని ఒప్పుకొనలేదు. ఆశకు ఏమాత్రమూ అవకాశం లేనప్పటికి కూడా ఒకరకంగా నాలో నేనే ఆశను సృష్టించు కున్నాను. ఆమె పైకి ప్రశాంతంగా వున్నట్టు కనుపించేది. కానీ, ఆమె హృదయంలో ప్రళయాగ్ని జ్వాలలు రేగుతూ వుండేవి నిరంతరం! వాటిని నేను ఎన్నడూ వూహించలేదు. వూహించే శక్తికూడా లేదు నాకు అప్పట్లో!

—o—

(7)

# 8

రెండు నెల్లుగా ఆమెలో ప్రత్యేకమైన కొన్ని మార్పులను చూస్తున్నాను. ఆమె అస్తమానమూ చాలా అన్యమనస్కంగా వుండసాగింది. ఎప్పుడూ ఏదో గాఢమైన యోచనా మగ్నతలో మునిగి వుంటుంది. ఒక రోజున ఆమె ఈ క్రొత్తమార్పును గురించే యోచిస్తూ కూర్చున్నాను. ఆమె సూదీ దారమూ తీసుకొని ఏదో గుడ్డమీద పూవులను కుడుతున్నది. ఆమె ముఖం సూదిమీదకు పూర్తిగా వంగివున్నది. అలావంగివున్న ముఖంలో ఏదోఅస్పష్టమైన బాధా, యోచనా కనుపిస్తున్నై. పైగా ముఖమంతా పాలిపోయినట్లు కనుపిస్తున్నది. ఈమధ్య ఆమె ఆరోగ్యం పూర్తిగా పాడయిపోయింది. ఆస్థితిలో ఆమెను చూశాక ఏదో తీరనిబాధ నాహృదయాన్ని కల్చి వేసింది. ఆమె క్షయరోగిలా రాత్రుళ్లు దగ్గుతూవుండే విషయం కూడా జ్ఞాపకానికి వచ్చింది. నేను వెంటనే అక్కడనుంచి ఏమీ మాట్లాడకండా బయటికి వెళ్ళిపోయాను. నేరుగా డాక్టరు దగ్గిరకు వెళ్ళాను.

ఆకస్మికంగా, డాక్టర్ ఇంటికి రావడంతో చాలా ఆశ్చర్య పడ్డది ఆమె. డాక్టర్ వంక అదోరకమయిన నిర్ల

త్ప్యతను కనబరచే చూపులను చూస్తూ, తెచ్చి పెట్టుకున్న నవ్వుతో "అవసరంలేదు... నాకేమీ అవసరంలేదు ! నేను బాగా ఆరోగ్యంగా వున్నాను !" అన్నది.

డాక్టర్ ఒకమాటు నా భార్యవంక పరీక్షగా చూసి, నన్ను రెండవగదిలోకి పిలిచి "త్వరగా మీరీమెను ఏ సము ద్రతీర ప్రదేశానికయినా, లేక మరే ఇతర ఆరోగ్యకరమైన ప్రదేశానికయినా తీసుకు పొండి. కొన్నాళ్ళపాటు అక్కడ వుంచితే తప్పకండా ఈమెగారి ఆరోగ్యం కుదట పడవచ్చును!" అన్నాడు.

డాక్టర్ వెళ్ళాక నా భార్య చాలా గంభీరంగా, నావైపుచూస్తూ ఇలా అన్నది "నిజం ! నేను చాలా ఆరో గ్యంగా వున్నాను. నాకేవిధమైన అనారోగ్యమూ లేదు. నాకు వైద్యంతో పనిలేదు !" ఈ మాటలు అంటూవుంటే సిగ్గు వల్ల ఆమె ముఖం ఎర్రనైంది. ఎందువల్లంటే ఆమె నన్ను చంపడానికి ప్రయత్నించింది. అయినా నేను ఒక ఆదర్శపత్నీ వ్రతుడిలా ఆమెను రక్షించడానికి సిద్ధం అవుతున్నాను !

నెల రోజుల అనంతరం ఒకనాటి సాయంత్రం నేను నా ఆఫీసు గదిలో కూర్చుని లెఖ్ఖలు చూసు కుంటున్నాను. అదే సమయాన ఆమె తీస్తున్న సన్నని కూనిరాగం వినిపిం చింది. ఆమె ప్రక్కగదిలో మేజాముందు కూర్చుని పాడు తున్నది. ఆమె ఇలా పాడడం సరికొత్త విషయం ! కనుక ఆ కూనిరాగం నా హృదయంమీద అవ్యక్తమైన ప్రభా

వాన్ని వేసింది. జబ్బువలన ఆమె స్వరం బాగా క్షీణించి పోయింది. ఆకూనిరాగం పాడుతున్నట్టుగా లేదు, శోకిస్తు న్నట్టుగా వున్నది. అగస్మాత్తుగా, పాడుతుండగానే దగ్గు తెర రావడంతో ఆమె పాటను విధిగా ఆపేసింది. నా సర్వేంద్రి యాలూ ఒక్కసారిగా ఉచ్ఛస్థాయిలో కంపించ సాగినయ్యి. దగ్గు తెర తగ్గిన తరువాత వెనకటి లాగానే గద్గద స్వరంలో కూనిరాగం తీయసాగింది ఆమె.

నా సర్వేంద్రియాలూ కంపించడానికి కారణం ఆమెమీద సానుభూతి కాదు. మరిఒక అస్పష్ట, అవ్యక్త భావన నాలో పనిచేసిందా క్షణాన. ఆ భావన ఏమిటో స్పష్టంగా, వివరించి చెప్పమంటే నేను చెప్పలేను. "ఆమె నేను వున్నాననే విష యాన్ని కూడా మరచి పాటలో లీనం అయింది. అంటే ఆమె నా అస్తిత్వాన్నే లెక్ఖచేయ లేదన్నమాట !" అని ఆలోచించుకుని నేను క్షణ క్షణానికి చలించి పోతున్నాను. ఇంతకు క్రితం ఆమె ఏనాడైనా నా ఎదురుగా పాటపాడి వున్నట్లయితే, నాలో ఈరకమైన ఆలోచన కలిగేదే కాదు. ఆమె నా ఎదురుగా పాట పాడడానికి సిగ్గుపడుతూ వుండేది.

కొంతసేపటివరకూ నేను స్తంభించి కూర్చుండి పోయాను. తరువాత లూకేరియా సాయంతో నా కోటును ధరించాను. నేను ఒక పసిపిల్లవాడిలా వ్యాకుల పాటుతో ల్యూకేరియాను అడిగాను. "ల్యూకేరియా ! ఐతే, ఆమె పాడుతున్నదా ?" ల్యూకేరియా నా ఆశ్చర్యాన్ని గానీ, వ్యాకు

లాన్నిగానీ ఏమాత్రమూ గమనించలేదు. మళ్ళీ అడిగాను "ఇవ్వాళ కొత్తగా పాడుతున్నది ! కానా?"

"లేదు, ఇంత క్రితంకూడా మీరు లేనప్పుడు రెండు మూడుసార్లు పాడింది !"

నేను బయటికి వెళ్ళిపోయాను. చాలా సేపటివరకూ బజార్ల వెంట నిరాదర్శంగా తిరిగి,విసిగి ఇంటికివచ్చాను. బజార్లలో తిరుగుతున్నంతసేపూ నాభార్యాయొక్క మలినమైన ముఖము, బలహీనమయిన స్వరము నా హృదయంలో మెదలుతూనేవున్నై. ఆమెలోని తన్మయత స్ఫురణకు వచ్చినప్పుడల్లా నా గుండెల్లో ఏదో బలమైన దెబ్బతగిలినట్టుగా వుండేది. నా అస్తిత్వాన్ని కూడా మర్చేపోగల భావోన్మేలతను ఆమె అలవరచుకున్నది; ఈ భావన నాకు పిచ్చి ఎక్కించింది. బజారు నించివచ్చి గొంతువరకూ పట్టించిన త్రాగుబోతులా పడుతూ లేస్తూ పడకగదిలోకి పోయాను. నా భార్య ఇంకా అక్కడే కూర్చుని పూవుల్ని కట్టుకుంటున్నది. పాట ఆగిపోయింది. ఆమెలోని గాంభీర్యం గదిలో ఒకరకమైన ప్రభావాన్ని వుత్పన్నం చేస్తున్నది. అది చూసి నాలో చిత్రమైన భావోద్రేకం పొంగువారింది. నేను వళ్ళు మరచి మోహామగ్నుడనై ఆమె దగ్గరకు వెళ్ళి ప్రక్కనే కూర్చున్నాను. ఆమె ఒకమాటు నిర్లక్ష్యంగానూ, భయంగానూ నావంకచూసి తిరిగి పూలుకుట్టుకోవడంలో మగ్నమైంది. ఆ నిర్లక్ష్య, భయోద్విగ్న నేత్రాల్లో ఒక అపూర్వ

సౌందర్య జ్యోతి వెలిగింది. నేను పూర్తిగా వళ్ళుమరచి ఆమె చేయి పుచ్చుకుని ఏదో అస్పష్టంగా మాట్లాడాను. నే నాస మయంలో పూర్తిగా వళ్ళుమరచి వున్నాను. అందువల్ల ఏం మాట్లాడానో జ్ఞాపకంలేదు. కానీ,అస్వాభావికంగా వున్న నా మాటల్నివినీ, వేషాన్ని చూసీ, ఆమె కొంచంగా కంపించిన మాట మాత్రం నాకు జ్ఞాపకం ! నేనా వళ్ళు తెలియని స్థితిలో ఆమె రెండుకాళ్ళనూ గట్టిగా పట్టుకుని ఆమె పాదాల మీద సాష్టాంగ పడ్డాను. ఆమె ఆశ్చర్యంతోటీ భయంతోటీ కూర్చున్న కుర్చీమీద నుంచి అదిరిపడి నిలబడ్డది. కానీ నేనా సమయంలో అపూర్వంగా రోమాంచితుడ నయినాను. అలాంటి ఆనందానుభూతిని నేను జీవితంలో మరె న్నడూ అనుభవించలేదు. నేను మాటి మాటికీ ఆమె కాళ్ళను ముద్దు పెట్టుకుంటున్నాను. ఆమె విభ్రాంతితో నా పిచ్చిని గమనిస్తున్నది. మెల్లగా ఆమె విభ్రాంతి ఆలో చనగా మారింది. కాసేపు, అవాస్తవికమైన నా ఈ ఉన్మా దానికి కారణం ఏమిటా? అని ఆలోచించింది. రెండు నిమి షాల అనంతరం ఆమె ముఖంలో, యోచనా మగ్నతకు సం బంధించిన ముడతలు అదృశ్యమై నిష్పారిన చిరు నవ్వు మెరిసింది ! క్షణం తరువాత ఆ చిరునవ్వు అదృశ్య మైంది. హిస్టీరియా ఫిట్ వచ్చిన దానిలా వికటంగా పెద్దగా నవ్వసాగింది. నేను ఆమె ఈ అన్యక్తస్థితిని ఏమాత్రమూ గమనించక వెనకటిలాగే కాళ్ళమీద పడివుండి, ఆమె చీరె కుచ్చెళ్ళ ముందుభాగాన్ని ముద్దు పెట్టుకుంటూ అస

ష్టంగా అవ్యక్తంగా ఇలా అన్నాను 'నాకు శాశ్వతంగా నీ చేలాంచలాల్ని ముద్దు పెట్టుకుంటూ జీవించగల అదృష్టాన్ని ప్రసాదించు!"

ఆమె పూర్తిగా వణికి పోతున్నది. నా మాటలకు ఏ విధమైన సమాధానాన్నీ ఈయకండా ఎక్కెక్కి ఏడ్వడం మొదలు పెట్టింది. రెండు క్షణాల తరువాత హిస్టీరియా తెర ప్రబలంగా వచ్చి ఆమె పడిపోయింది. నేను క్రింద పడకండా రెండు చేతులమీదా వేసుకుని మంచం మీద పడుకో పెట్టాను. "ఫిట్" ప్రభావం తొలగాక ఆమె లేచి కూర్చొని మృదువుగా కరుణా పూరితమైన స్వరంలో ఇలా అన్నది. "శాంతించండి...ఎందుకలా అధైర్య పడతారు !" ఈమాట అంటూనే తిరిగి ఏడుపు మొదలు పెట్టింది. నేను ఓదారుస్తూ గాలి మార్పుకు నిన్ను "బెలూన్" కు తీసుకు పోతాను. అక్కడ నీ ఆరోగ్యం త్వరలో బాగుపడతుంది !" అన్నాను. ఇంతే కాక ఈ వడ్డీ వ్యాపారాన్ని శాశ్వతంగా వదిలి పెట్టేస్తున్నాననీ, భవిష్యత్తులో ఎన్నడూ తన మనస్సును కష్టపెట్టననీ చెప్పాను. నా మాటల్ని ఆమె కుతూహలంగా విన్నమాట వాస్తవమే గానీ' ఈ మాటలవల్ల ఆమెలో ఏర్పడ వలసిన శాంతి, ధైర్యాలు ఏర్పడక పోగా అశాంతి, బాధా కనుపించాయి ఆమె కండ్లల్లో! కానీ, నాలో ప్రేమోన్మాదం హెచ్చు కాజొచ్చింది. ఆమె కాళ్ళదగ్గిర అలాగే పడివుంటూ ఆమె కుచ్చెళ్ళను ముద్దు పెట్టుకుంటూ జీవించాలి—అనే భావన నాలో దృఢం కాజొచ్చింది.

నేను అన్నాను "నా కోర్కె మరేమిలేదు. నీకాళ్ళ దగ్గిర ఒక అధమమైన కుక్కలాగా బ్రతకనివ్వు! అంతే చాలు! నీవు నన్ను ద్వేషిస్తున్నావన్న విషయం నాకు తెల్సు...అయినా అర్థిస్తున్నాను; నీ కాళ్ళ దగ్గిరపడి బ్రతక నీయవా? చెప్పు"

కొంత సేపటి వరకూ ఆమె ఏమీ మాట్లాడలేదు. కానీ ఏమో మాట్లాడాలనే ఆసక్తి, గొంతు రుద్ధం కావడం వల్ల మాట్లాడ గలగలేని వివశత్వం ఆమె ముఖంలో స్పష్టంగా కనుపిస్తున్నై. చివరకు ఆమె చాలా ప్రయత్నం మీద నోరు పెగల్చుకుని ఒకే ఒకమాటను మాట్లాడింది. "నా...... మొదట, నన్ను నీవు అలాగే, నా చావు బ్రతుకుల్ని కూడా పట్టించుకోకుండా చూస్తావు అనుకున్నాను—" అంటుండ గానే ఆమె ముఖం ఎర్రబడ్డది.

ఆమె మాట్లాడిన పద్ధతినిబట్టి ఇన్నాళ్ళుగా నామీద ఆమెకు వున్న సందేహం, ద్వేషం ఇవ్వాల్టి నా మాటలతో ప్రవర్తనతో నశించి పోయినవని రూఢిగా వూహించాను. ఈ వూహతో అపారమైన ఆనందాన్ని అనుభవించాను. రేపటి నించీ క్రొత్త జీవితం ప్రారంభం కానున్నదనే ఆనం దంలో పులకించి పోయాను. త్వరలో లభించనున్న క్రొత్త జీవితంలో స్పర్థలూ, ఈర్ష్యలూ అన్నీ దగ్ధమై పవిత్రమైన

నిష్కల్మషం వెలుగుతుంది. భవిష్యత్తులో అనుభవించనున్న ప్రేమను వూహించుకుని అనేకసార్లు పులకాంకితుడ నయ్యాను.

చీకటిపడే సమయానికి ఆమె ఆరోగ్యం బాగా చెడిపోయింది. నేను చాలా గాభరా పడ్డాను. మనస్సులోనే భగవంతుడిని వుద్దేశించి "ఓయి భగవంతుడా ! నా హృదయంలో వెలసిన ఈ నవజీవనపు కమనీయ భావాలకు ఎలాంటి విఘ్నమూ కలుగనీయకు !" అని వేడుకున్నాను. నేను మనస్సులోనే అనేకసార్లు "బెలూన్" అనే శబ్దాన్ని వల్లించుకున్నాను. ఎందువల్లో "బెలూన్"కు వెడితే నా భార్య ఆరోగ్యం కుదుట పడుతుందనీ, నేను ఆసించిన నూతన జీవితం లభిస్తుందనీ ఆశగా వున్నది.

—o—

# 9

పై ఆలోచన నా అత్యాశను మాత్రమే తెలియజేస్తుంది. ఎందువల్లనంటే; మేమిద్దరమూ ఇన్నాళ్ళుగా ఒకచోట వున్నప్పటికీ మా ఇద్దరిమధ్యా అభేద్యమైన భిన్నత్వం స్థిరమై వున్నది. ఈ భిన్నత్వం కారణంగా నేను ఎంత భావప్రవణుడనై నా ప్రేమను ఆమె ముందు నివేదించుకున్నప్పటికీ ఆమెలో నామీదా, నా ప్రేమ మీదా నమ్మకం, విశ్వాసం కలగడానికి బదులు అపనమ్మకం అవిశ్వాసమే కలుగుతూ వచ్చాయి. తుచ్ఛమైన స్వార్థం కారణంగా ఇన్నాళ్ళుగా తనను అవమానిస్తూ వచ్చిన వ్యక్తి ఒక్కసారిగా మారిపోయాడని ఆమె విశ్వసించ లేకపోయింది. ప్రేమోన్మాద స్థితిలో నా నోటినుండి వెలువడ్డ మాటల్ని "నటనగా" మాత్రమే ఆమె స్వీకరించింది. అభినవ జీవితానికి సంబంధించిన నా మాటల్ని విని ఆనందించడానికి బదులు మరికొంచెం శంకించనూ, అనుమానించనూ సాగింది. అప్పటికీ ఆమె లజ్జారుణిత కపోలాలతో నన్ను ఓదార్చింది. "మీరు ఇంత అస్తిమితం పొందకూడదు...ఉద్రేక పడకూడదు !" అన్నది. నేను ఆమె మాటకు సమాధానంగా "మనం 'బెలూనుకు' వెళదాము. బెలూనుకు! అక్కడ క్రొత్తవసంతపు ఉజ్వల ప్రభాతంలో, మనం క్రొత్తసంసారాన్ని, క్రొత్తజీవితాన్ని సాగిద్దాము !" అన్నాను.

నేను వ్యాపారాన్ని మానేశాను. నా ప్రవర్తనలన్నిటికన్నా నా వడ్డీవ్యాపారమే ఆమె హృదయంలో గుచ్చుకుంటూ వున్నదని నాకు తెల్సును. అందువల్లే వ్యాపారాన్ని ఆపేశాను. వ్యాపారంద్వారా నాకు లభించిన ధనాన్నంతటినీ బీదలకు పంచుతాననీ, కేవలమూ పెంపుడు తల్లివల్ల లభించిన 3 వేల రూపాయలు మాత్రం "బెలూన్" యాత్రానిమిత్తం దగ్గిర వుంచుకుంటాననీ కూడా ఆమెకు చెప్పాను. ఆమె సంపూర్ణంగా ఆరోగ్యాన్ని పొంది "బెలూన్" నుంచి తిరిగి వచ్చాక స్వశక్తి ప్రధానంగా ధనోపార్జనచేసి జీవితాలను గడుపుదామని చెప్పాను. స్వశక్తి అంటే; తనశక్తిమీదా తన రక్తపు బిగిమీదా ఆధారపడడమని నావుద్దేశ్యం! ఆమెకు నామీద అధిక విశ్వాసాన్ని కలిగించడానికి పైమాటల్ని తెలియ చేశాను. కానీ ఆమె యే విధమయినటువంటి విశ్వాసాన్ని ప్రకటించలేదు. చిరునవ్వునవ్వి మాత్రం వూరుకున్నది. ఆ చిరునవ్వుతో ఇంకా నామీద ఆమెకు విశ్వాసం కుదరలేదని తెల్సుకున్నాను. నేను భావుక ప్రవృత్తుల వుధృత ప్రవాహంలోపడి వున్నతమైన ఆదర్శాన్ని కళ్ళుమూసుకుని క్షణకాలం స్వీకరించానని ఆమె అభిప్రాయం. భవిష్యత్ జీవితం తాలూకు సుఖమయ కల్పనల్లోని ఆనందం నష్టం కాకుండా వుండడానికి ఆమె చూపిన నామీది ఈ అవిశ్వాసాన్ని మర్చేపోవడానికి అనేక విధాల ప్రయత్నం చేశాను!

ఆ రోజున ఆమె కాళ్ళను అలా ముద్దుపెట్టుకోవడం నా మూర్ఖత్వానికి పూర్ణమైన నిదర్శనం! ఆమె భావుకతను

చూసి భయపడ్డంతగా మరే విషయానికి భయపడదు. కారణం; బహు చిన్నతనంనుంచీ ఆమె బాధామయ జీవితానికి అలవాటు పడ్డది. చేదైన అనుభవాల్ని ఎన్నింటినో అనుభవించింది. వాస్తవికమైన జీవితంలో భావుకతకు ఎలాంటి స్థానమూ వుండదు. కనుక భావుకతతో నిండిన అనర్గళమైన మాటలుగాని, చేష్టలుగానీ ఆమెకు అసహజాలనిపించడం వింతకాదు !

ఇది జరిగిన మరునటి రోజున ఆమె ఒక ప్రసిద్ధమైన సాహిత్యకృతిని గురించి తన అభిప్రాయాన్ని వెల్లడించింది. ఆమె అభిప్రాయాన్ని విని నేను ఆశ్చర్య చకితుడనయ్యాను. ఎవరో విజ్ఞపురుషుడి నోటినుండి వెలువడ్డట్టుగా వున్నదా అభిప్రాయం ! నేను ఆమె సాహిత్యాభిరుచినీ విమర్శనా జ్ఞానాన్నీ ప్రశంసించకుండా వుండలేక పోయాను. "నీ సాహిత్యజ్ఞానం చాలా వున్నతమైనది. ఈ చిన్న వయస్సులోనే అపూర్వమైన రసజ్ఞతను సంపాయించావు. నేను నీలో దశమాంశాన్ని కూడా సంపాయించుకోలేదు !" అన్నాను. ఈ మాటలు వినగానే ఆమె ముఖం సిగ్గుతో ఎర్రనైంది. "నీకు అతిశయోక్తులు పలకడం అలవాటైంది. ఇలాంటి పొగడ్తలు వింటే నా మనస్సుకు చాలా కష్టం కలుగుతుంది !" అన్నది.

నేను ఇక్కడ పొరబడ్డాను. స్త్రీ సహజమైన సిగ్గువల్ల ఆమె ఇలా అంటున్నదేగాని, వాస్తవానికి తన ప్రశంసను

విని సంతోషపడి వుండవచ్చును అనుకున్నాను. అదేస్థితిలో నేను తను కర్నల్ ఎఫిమోవిచ్‌తో కలసిననాటి సంఘటనను గురించికూడా మాట్లాడాను. ప్రక్కగదిలోవుండి నేను అంతా విన్నానని కూడా చెప్పాను. అంతేగాకుండా, కాముకుడయిన ఆ నీచుడి ప్రతిచేష్టనూ ఖండించి అపూర్వమైన పవిత్రతను ప్రదర్శించావని కూడా పొగిడాను ఆమెను.

తను ఎఫిమోవిచ్‌ని కల్సుకోవడం నాకు తెల్సుననీ, వారి మాటల్ని నేను రహస్యంగా విన్నాననీ చెప్పగా విని ఆమె ఒక్కసారిగా భయంతో కంపించి పోయింది. రెండు చేతులనూ ముఖానికి కప్పుకుని ఏడవసాగింది. పరాకాష్ట నందుకున్న నా మూర్ఖత్వపు ఈ దుష్పరిణామాన్ని చూసి సహించుకోలేక ఆమె కాళ్ళమీదపడి ఏడుస్తూ క్షమించమని ప్రార్థించాను. నా ఈ ప్రవర్తన కారణంగా ఆమె తిరిగి ఒకమాటు హిస్టీరియా తెరకు గురైంది.

ఆరోజు రాత్రి ఆమె చాలా శాంతంగా వున్నది. మే మిద్దరమూ ఒకేసారి భోజనానికి కూర్చున్నాము. మరునాడు వుదయాన్నే ఆమె నాదగ్గిరకు వచ్చింది. "నేను మిమ్మల్ని చాలా పొరపాటుగా అర్థం చేసుకున్నాను. మీపట్ల చాలా అన్యాయము చేశాను !" అన్నది. వైభావనతో ఆమె మనస్సు చాలా రోజులు బాధపడ్డది. చలికాలం గడిచి పోయింది. మరొక రోజున ఆమె నాతో ఇలా అన్నది "నాకు ఇప్పుడు యదార్థం తెలిసింది. నీస్వభావం, గుణ

గనాలూ చాలా గొప్పవి. ఇకనిన్ను నేను నిజమైన హృదయంతో ప్రేమిస్తాను!"

ఈ మాటలకు నేను పూర్తిగా పిచ్చివాడినయి పోయాను. ప్రేమావేశంలో గట్టిగా ఆలింగనం చేసుకుని ఆమె ముఖాన్ని ముద్దుపెట్టుకున్నాను. హృదయంలో ఏవో నూతన మయిన అనుభూతులు మేలుకున్నై. నా జీవిత చరమ స్వప్నం రూపందాల్చి ప్రత్యక్ష మైనట్టయింది. "ఆమె నన్ను కోరుతున్నది; ఆమెకు నేను ఇష్టుడిని!" అనే భావన నాలో కల్పించిన ఆనందం వర్ణించ శక్యంకాదు. "బెలూన్" యాత్రకు సంబంధించిన పాస్‌పోర్టులను సంపాయిద్దామనే వుద్దేశ్యంతో నేను వెంటనే బయటికి వెళ్ళాను. దాదాపు రెండు గంటల వరకూ బజార్లోనే పనులతో గడిపాను. తరువాత నేను ఇంటికివచ్చి చూసిన దృశ్యం! హరి భగవంతుడా! అలాంటి భయంకరమైన దృశ్యాన్ని చూడవల్సి వస్తుందని నేను ఎన్నడూ కల్లోకూడ అనుకోలేదు. అబ్బ...ఒక్క అయిదు నిమిషాలు ముందుగా నేను ఇంటికి తిరిగి వచ్చినట్ట యితే ఆ భయంకర దుర్ఘటన సంభవించి వుండక పోవచ్చును! కానీ, ఐదునిమిషాల ముందు ఎలా రాగలను? అదృష్టం నన్ను జీవిత ప్రారంభం నుంచీ వంచిస్తూనే వున్నది. ఈ సారి మాత్రం ఎందుకు వంచించదూ? నేను బజారునుంచి తిరిగి వచ్చి చూసేసరికి గడపలో చాలామంది మనుషులు గుమిగూడి కనుపించారు. నేను అవ్యక్తమయిన శంకతో కంపించి పోయాను.

తరువాత ల్యూకేరియా ఆ దుర్ఘటనకు సంబంధించిన వివరాలన్నింటినీ సవిస్తరంగా చెప్పింది. నేను తిరిగి రావడానికి దాదాపు 20 నిమిషాలకు పూర్వం ఏదో విషయాన్ని గురించి మాట్లాడడానికి ల్యూకేరియా నా భార్య దగ్గరకు పోయిందట. అప్పుడు నాభార్య తను వెనక ఒకమాటు నాదగ్గర కుదువ పెట్టడానికి తెచ్చిన దేవతా విగ్రహాన్ని ముందు పెట్టుకుని పూజ చేస్తున్నదట.

ల్యూకేరియా నాభార్యని అడిగింది. "ఏంచేస్తున్నారమ్మా"

నాభార్యా సమాధానాన్ని ఇచ్చింది "ఏమీలేదు. కాసేపు నన్ను ఏకాంతంలో వుండనీ! సరే—వుండు!" అంటూ ల్యూకేరియా దగ్గరకుపోయి వాత్సల్య పూరితమైన స్పర్శలతో ఆమెను ముద్దుపెట్టుకున్నది నాభార్య.

ల్యూకేరియా అడిగింది. "మీరు సంతోషంగా వున్నారా?"

"వున్నాను ల్యూకేరియా!"

"నీ భర్త చాలా పొరపాటు చేశాడు. అతడు తన అహంభావంవల్ల ఇంతవరకూ నీ దగ్గిరకు వచ్చి తన అకృత్యాలను క్షమార్పణను వేడుకోలేదు.—ఎలాగైనా కానీ, ఇన్నాళ్టికి మీ ఇద్దరికీ మనస్సులు కలిసినై; ఇదే పరమ సంతోషకరమయిన విషయం!"

"నిజమే ! సంతోష కరమయిన విషయమే ! ఇక నీవు కాసేపు అవతలికి వెళ్ళు ల్యూకేరియా !" అంటూ నాభార్యా శాంతంగా నైరాశ్య పూర్ణమైన చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వును సరిగా అర్థంచేసుకోలేక పోయినా దానిలోని అనర్థ సూచకాలను కొంత వరకు పసికట్టింది. ల్యూకేరియా కంపించి పోయింది. అప్పటి కయితే ల్యూకేరియా బయటికి వచ్చింది. కాని ఎక్కువసేపు బయట నిల బడ లేకపోయింది. పదినిమిషాల తరువాత తిరిగీ గదిలోకి వెళ్ళింది. అప్పుడు నాభార్యా ఒక గోడను ఆనుకుని నిలబడి వున్నది. తలబాగా ముందుకు వాలిపోయింది. అప్పటి ఆమె వాలకాన్ని బట్టి నా భార్యా ఏదో దుర్భర చింతనలో వున్న దని గ్రహించింది ల్యూకేరియా. అందుకు నిదర్శనం; ల్యూకేరియా తన గదిలోకి వచ్చిందనిగానీ, తన దగ్గిరకు వచ్చిందని గానీ ఆమెకు మాత్రం తెలియదు ! ల్యూకేరియా అక్కడ నిలబడ్డ ఆ కొద్ది క్షణాల్లోనూ నా భార్యా తిరిగి వెనకటి లాంటి నిరాశా పూర్ణమైన చిరునవ్వునే నవ్వింది రెండు మూడు సార్లు ! అంటే తన మానసిక కల్పనల్లో తనే నవ్వు కుంటున్న దన్నమాట ! అప్పటికి ల్యూకేరియా అక్కడ నించీ వెళ్ళిపోయింది. కొద్ది సేపటి తరువాత ఎవరో కిటికీ తెరచిన శబ్దం కావడంవల్ల తిరిగి లోపలకు వెళ్ళింది.

అక్కడ నా భార్యా కిటికీ తెరచి మెట్టుమీాద నిలబడి వుండగా ల్యూకేరియా చూసింది. అప్పటి స్థితిని గురించి ల్యూకేరియా ఇలా చెప్పింది. ''నా వైపు అమ్మగారి వీపు

వున్నది. ఏదో అనర్థం జరగనున్నదని తలచి "అమ్మగారూ! అమ్మగారూ!" అని అరచాను. నా అరుపులు వినగానే అమ్మగారి కాళ్ళు తడబడ్డయ్యి. మనిషి కొంచెం చలించింది. బహుశా వెనక్కి రావచ్చునను కున్నాను. కానీ, అలా జరగలేదు. దేవతా విగ్రహాన్ని గుండెలకు అదుముకుని మరొక అడుగు ముందుకు వేసి కిటకీలోనుంచి క్రిందకు దూకింది !"

నేను ఇంటికి చేరేసరికి ఆమె ఒళ్ళు ఇంకా వేడిగానే వున్నది. ఆమె చూపులు నావైపే కేంద్రీకరించుకుని వున్నట్టుగావున్నై. మొదటకొంతసేపు ప్రక్క ఇళ్ళవారు వస్తూపోతూ కొంత సందడిగా వున్నది. తరువాత భయంకరమైన నిశ్శబ్దత వ్యాపించింది అక్కడ. అంత వరకూ అక్కడ గుమిగూడిన ప్రజలు నేను రావడంచూసి ఎటువాళ్ళు అటు పోయారు. కేవలమూ నా భార్యా శవం మాత్రం నిశ్చలంగా శాశ్వతమైన నిద్రలో అభిభూతమై పడుకునివున్నది. మధ్యలో ఒకరూ ఇద్దరూ నా దగ్గిరకువచ్చి ఏమిటో చెబుతున్నారు. కానీ నేను పూర్తిగా వున్మాదగ్రస్తుడనైపోయాను. ఎవరు ఏం చెబుతున్నారో నాకు తెలియలేదు. తరువాత ల్యూకేరియా చెప్పిన మాటల్ని బట్టి మృత్యుముఖాన వున్న నాభార్యా కూడా ఏవో కొన్ని అస్పష్టమైన మాటల్ని చెప్పిందట నాతో ! కాని నేను బొత్తిగా వినలేదు. కేవలము ఒకే ఒకసారి ఎవరో నా దగ్గిరకు వచ్చి ఇలా అనడము విన్నాను. "ఆమె నోట్లో నుంచి రక్తం ధారలుగా ప్రవహించింది. అందువల్లే మృత్యువు

సంభవించింది !" అంటూ ఆ వ్యక్తి నేలమీద పేరుకున్న రక్తంవైపు వేలుతో సౌజ్ఞచేసి చూపాడు.

ల్యూకేరియా తరువాత చెప్పిన దాన్నిబట్టి అలా చెప్పిన వ్యక్తిమీదకు పిచ్చివాడిలా గుప్పెట బిగబట్టి కొట్టడానికి వెళ్ళానుట. ఆ వ్యక్తిని వుద్దేశించి ఇలా అరిచానుట "ఏం వాగావు? నాభార్యా చనిపోయిందా?"

అబ్బ ! ఆసంఘటన చాలా భయంకరమైనదీ, శోచనీయమైనదీను ! అసంభవమూ, అస్వాభావికము అయిన ఆ సంఘటనను గురించి ఆలోచించిన కొలది నేను భయవిహ్వాలుడనై పోతాను !

ఐపోయింది.

ఏ పుస్తకము కావలసినా

మాతో సంప్రదించండి

మా వద్ద

* నవలలు
* కథలు
* నాటకాలు
* నాటికలు
* శాస్త్రీయ గ్రంథాలు
* చరిత్రలు
* బాలసాహిత్యం
* బుర్రకథలు
* గేయములు

మొదలగు అనేక రకాల సాహిత్యం ఇంగ్లీషులోను, తెలుగులోను దొరకును.

**జనసాహితి, (బోస్‌రోడ్) తెనాలి.**

TITLE PRINTED AT THE ORIENT POWER PRESS, TENALI